# CELEBRATE WORLD BOOK DAY BY MAKING A GIFT OF BOOKS
## TO YOUR DEAR AND NEAR ONES • FOR YOURSELF TOO

THREE EXCITING BOOKS FROM

## MANOJ DAS AND RUSKIN BOND

BOTH RENOWNED WRITERS FOR CHILDREN










Also four books of

**LEGENDS AND PARABLES OF INDIA**

from CHANDAMAMA







**INDIA IS A LAND OF STORIES, RICH IN LEGENDS, PARABLES AND MYTHS.**

***Chandamama*** has enriched many generations of young minds with these stories. The spiritual subtext and moral lessons in these delightful stories continue to fascinate and mould young Indian minds.

***Popular Prakashan*** has co-published these stories to educate, entertain and inspire the growing generation.

CHANDAMAMA   PopulaR prakashan

***FOR FURTHER ENQUIRIES CONTACT :***
***CHANDAMAMA INDIA LTD., 82, DEFENCE OFFICERS COLONY***
***CHENNAI - 600 032***

NOW AVAILABLE AT YOUR NEAREST NEWS STAND FOR RS.15 PER COPY

# A TREASURE-TROVE FOR TALENTED TOTS



# Junior
CHANDAMAMA



**Junior Chandamama is the only magazine that encourages its young readers to develop their inherent talent.**

## AN IDEAL GIFT FOR AN INTELLIGENT CHILD

## FOR ANNUAL SUBSCRIPTION PAY ONLY RS. 150
## AND SAVE RS. 30

*Mail the form below along with the remittance to :* **SUBSCRIPTION DIVISION,** Chandamama India Limited, 82 Defence Officers' Colony, Ekkatuthangal, Chennai - 600 097.

## SUBSCRIPTION FORM

I wish to be a subscriber of Junior Chandamama.

Name ____________________

Age ________ Class ________ School ____________________

Home Address ____________________

____________________

____________________ PIN ________

I am enclosing D/D No ________ on ____________________ Bank/

M.O. receipt No ________ issued by ____________________ P.O. for Rs.150. Please

start supply from ____________________ (month).

Date ____________ Signature




చందమామ సంపుటి: 60 మే 2007 సంచిక:5

## ఈ సంచికలో...


* పాఠకుల లేఖలు ...06
* స్నేహధర్మం ...07
* ఆలోచన! ...12
* రాకాసిలోయ - 21 ...13
* భారత దర్శిని ...25
* నిద్రపట్టని పిశాచం ...26
* చందమామ కబుర్లు ...30
* చందమామ ఇండియా క్విజ్ - 4 ...35
* గురువు సలహా ...36
* జడుపుజ్వరం ...42
* మేక నవ్వింది! ...45
* తెలివైన దొంగ ...55
* అజేయుడు గరుడుడు! - 16 ...59
* మన సాంస్కృతిక ఉత్సవాలు: బుద్ధ (జయంతి) పూర్ణిమ ...63
* విజ్ఞానం ... వినోదం ... వికాసం ... ...64
* ఫోటో వ్యాఖ్యల పోటీ ...66


## ఈ నెల విశేషాలు



ఉత్పలాక్షి ప్రేమ (బే.క) ...19



మొర ఆలకించిన దేవుడు! ...31



నిజమైన గౌరవం ...40



రామాయణం (అరణ్యకాండ-2) ...49


**SUBSCRIPTION**

For USA and Canada
Single copy $2
Annual subscription $20

*Remittances in favour of Chandmama India Ltd.*
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal,
Chennai - 600 032
E-mail :
subscription@chandamama.org

చందా

ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. 150.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.












వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# క్రీడాస్ఫూర్తి కొరవడుతూన్న క్రీడలు!

పోటీలలో పాల్గొనే వారందరూ విజేతలు కాలేరన్న ప్రాథమిక సత్యాన్ని ఇవాళ క్రీడాకారులూ, అభిమానులూ, ప్రాయోజకులూ అందరూ మరిచి పోతున్నారు. పోటీలన్నాక కొందరు విజేతలయితే, మరి కొందరు విజయావకాశాలు కోల్పోతారు. ఇది సహజం; అనివార్యం. గెలుపు ఓటములను సహజంగా తీసుకోవాలి. దీనినే క్రీడాస్ఫూర్తి అంటాం. అయితే, ఇది ఇవాళ బాగా కొరవడిపోతోంది.

క్రీడారంగంలోనూ వ్యాపారధోరణి పెచ్చుపెరిగి పోయింది. క్రీడాకారులు ప్రత్యేక వర్గం అన్న అంతస్తును సంతరించుకుంటున్నారు. వ్యాపార సంస్థలు తాము తయారు చేసే వినియోగ వస్తువుల 'బ్రాండ్ అంబాసిడర్'లుగా క్రీడాకారులను భావిస్తున్నాయి. మాధ్యమాల కారణంగా విజేతలు తృటిలో హీరోలుగా, సుప్రసిద్ధులుగా మారిపోతున్నారు. అయితే, ఈ మాధ్యమాలు సృష్టించే హోరు-క్రీడాకారులలో విపరీతమైన మానసిక ఒత్తిడిని కలిగిస్తున్నది. పర్యవసానంగా ఒక్కొక్కసారి తమకున్న శక్తిసామర్థ్యాలను పూర్తిగా వినియోగించి సక్రమంగా ఆడలేకపోతున్నారు. దాంతో ఆశాభంగానికి గురయ్యే అభిమానులు ఆగ్రహావేశాలకులోనై వాళ్ళమీదికే దాడులు జరుపుతున్నారు!

ఇవాల్టి పరిస్థితిని చూస్తూంటే మహాభారతంలోని ఒక ఘట్టం గుర్తుకు వస్తుంది. కురుపాండవుల శస్త్ర అస్త్ర విద్యల అభ్యాసం పూర్తయ్యాక, గురువు ద్రోణాచార్యుడు తమ శిష్యుల ప్రతిభాపాటవాలను పరీక్షించడానికి ఒక పోటీ నిర్వహిస్తాడు. ఆ పోటీ ప్రదర్శనలో పాండవులు, ముఖ్యంగా అర్జునుడు సాధించిన ఘనవిజయం, కౌరవులకు కంటగింపుగా తయారై, దుర్యోధనుడి మనసులో ఈర్ష్యాద్వేషాలను రగిలిస్తుంది. ఆఖరికి అది కురుక్షేత్ర సంగ్రామానికి దారితీస్తుంది!

క్రీడలను క్రీడలుగానే పరిగణిద్దాం. క్రీడాస్ఫూర్తితోనే చూద్దాం!

సంపాదకుడు : విశ్వం

Visit us at : http://www.chandamama.org



# పాఠకుల లేఖలు

చందమామలో పిల్లలనే కాక పెద్దలను అలరించే రచనలు ఉన్నాయి. పాఠకుల అభిప్రాయాలకు ప్రాధాన్యతనిచ్చే 'పాఠకుల లేఖలు', చారిత్రాత్మక ఘట్టాలను, కట్టడాలను, మహనీయులను గురించి తెలియజేసే 'భారతదర్శిని' అందరినీ అలరించే 'బేతాళ కథలు', పెద్దలకు ఉపకరించే ధర్మాలను తెలియజేసే 'రామాయణం' ఇలా వేటికవే ఆసక్తికరంగా ఉన్నాయి. చందమామ ఆచంద్రతారార్కం వెలుగొందాలని కోరుకుంటున్నాను.

–పి. ఆర్. నాగయ్య, తిరుపతి – 517 501(ఆం.ప్ర)

నేను నాకు ఊహతెలిసినప్పటి నుంచీ చందమామను చదువుతున్నాను. చిన్నతనంలో మా నాన్నగారు చందాకట్టి, చందమామను చదవటం అలవాటు చేశారు. ఇప్పుడు నా వయసు ముప్పై సంవత్సరాలు. ఇప్పటికీ చందమామను ఎంతగానో అభిమానిస్తాను అనేకన్నా ఆరాధిస్తాను అనడం సబబుగా ఉంటుంది. పత్రిక యాజమాన్యం చేతులు మారినా, వ్యవస్థాపకుల ఆశయం చెడకుండా, చిరకాలం ఉండేటట్లు చూడవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

–కె.పి. శైలజ, నాచారం, హైదరాబాద్ – 500 079 (ఆం.ప్ర)



చందమామ ఇండియా క్విజ్ పేరిట వస్తూన్న ప్రశ్నలకు సమాధానాలు వెతికే సాహసం 16 సం.లోపు పిల్లలు చేయలేరు. లోగడలాగే గత మాసపత్రికలు పరిశీలించి జవాబులు రాసే పద్ధతి బావుందనుకుంటాను. కొత్త రచయితలకు కూడా అవకాశం కల్పించి ప్రోత్సహించండి.

–వాస్తు రామచంద్ర, నెల్లూరు (ఆం.ప్ర)

కావాలంటే పత్రిక ధరను పెంచి తెలుగు చందమామను కూడా ఇంగ్లీషు చందమామ సైజులో తీసుకురండి. మరింత నిండుగా, ఆకర్షణీయంగా ఉంటుంది.

–శంకరనారాయణ, చెన్నయ్ – 600 116




# స్నేహధర్మం

వింధ్యారణ్య సమీపంలో విద్యాపతి నడుపుతూన్న గురుకులాశ్రమంలో సునీతి అనే పేదవిద్యార్థితో జయవర్మ, అజయవర్మ అనే ఇద్దరు కేకయ రాజకుమారులు చాలా స్నేహంగా ఉండేవారు. జయ, అజయవర్మలు సోదరులే అయినప్పటికీ ఈర్ష్యాద్వేషాలతో తరచూ పరస్పరం గొడవలు పడేవారు. సునీతి అలాంటి సందర్భాల్లో వారిద్దరినీ సముదాయించి, రాజీ చేస్తూ గురుకులంలో వారికి బాగా దగ్గరయ్యాడు.

సునీతి నిత్యాగ్నిహోత్రం కోసం కావలసిన సమిథలు, దర్భలు తేవడానికీ; తమ విలువిద్యా ప్రావీణ్యాన్ని పరిశోధించుకోవడానికి జయ, అజయవర్మలూ రోజూ అడవికి వెళ్ళేవారు. ఒకరోజు సునీతి దర్భల కోసం ఒంటరిగా అడవికివెళ్ళాడు. జయ, అజయవర్మలు అంతకు ముందే అడవిని చేరారు. వారిద్దరూ పక్కపక్కగా నిలబడి బాణ ప్రయోగం చేస్తూండగా, నెత్తి మీద మణితో ఒక సర్పం వెళుతూ కనిపించింది. వారు దాని మీద బాణాలు ప్రయోగించారు. అది ఆవేశంతో ఇద్దరినీ కాటువేసి, దాపుల చెట్టుకింద వున్న పుట్టలోకి దూరింది. జయ, అజయవర్మలు నురగలు కక్కుతూ పడిపోయారు.

ఇంతలో అక్కడికి వచ్చిన సునీతి, మిత్రుల దుస్థితి చూసి విషాదం చెందాడు. ఆ పుట్టలో వాసుకి వంశానికి చెందిన సర్పరాజం ఉందని తమ గురువు ఎప్పుడో చెప్పిన సంగతి గుర్తు రావడంతో, దాన్ని ప్రసన్నం చేసుకునే స్తవాన్ని ఏకాగ్ర చిత్తంతో పఠించి, ''సర్పరాజమా! మహావీరులై దుష్టశిక్షణ చేసి, రాజ్యానికి మేలు చేసే ఈ రాజకుమారులకు అకాల మరణం ప్రాప్తించకూడదు. కరుణించి వీరికి ప్రాణభిక్ష ప్రసాదించు,'' అని భక్తితో ప్రార్థించాడు.

కొన్ని క్షణాలలో పుట్టనుంచి, ''స్నేహధర్మంతో నీ మిత్రులను బతికించ మంటావనుకున్నాను. కాని వీరి శౌర్యం దేశానికి అవ

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



సరం గనక, వీరికి ప్రాణభిక్ష పెట్టమని ప్రార్థించావు. నీ ఉన్నత ఆశయానికి సంతసించి, వారి దుందుడుకు చర్యను క్షమించి, ఓటమి ఎరుగని వీరులుగా వారిని ఆశీర్వదించి బతికిస్తాను. నువ్వు తలుచుకుంటే మాత్రమే వారిని ఓడించగలవు; హతమార్చగలవు. భవిష్యత్తులో నీకెంత కోపం వచ్చినా స్నేహ ధర్మం పాటించి వాళ్ళ మీద కయ్యానికి వెళ్ళనని మాట ఇవ్వగలవా?'' అన్న కంఠస్వరం వినిపించింది.

''అవసరమయితే, నా ప్రాణాలర్పిస్తాను గాని, వారి జోలికి వెళ్ళను. నా తనువులో ప్రాణమున్నంతవరకు స్నేహధర్మాన్ని పాటిస్తాను,'' అన్నాడు సునీతి కన్నీరు కారుస్తూ.

మరుక్షణమే ఇద్దరు రాజకుమారులూ నిద్రనుంచి మేల్కాంచినట్టు లేచి కూర్చున్నారు. అప్పుడు మళ్ళీ పుట్టలో నుంచి, ''రాజకుమారులారా, మీ మిత్రుడు సునీతి ప్రార్థన మేరకు మీ అపరాధం క్షమించి మిమ్మల్ని సజీవుల్ని చేశాను. సునీతి తప్ప మిమ్మల్నెవరూ ఓడించలేరు. స్నేహధర్మం పాటిస్తూ సుఖంగా జీవించండి,'' అన్న కంఠస్వరం వినిపించింది.

జయవర్మ, అజయవర్మలు సునీతితో, ''మా ప్రాణాలు కాపాడావు. నీమేలు ఈ జన్మకు మరిచిపోము. నువ్వు ఏది కోరినా ఇస్తాం,'' అన్నారు కృతజ్ఞతతో.

''అంతా, ఆ సర్పరాజు కరుణ. మీరిప్పుడు అజేయులైన వీరరాజకుమారులు. మీరు కలిసివుంటే మిమ్మల్ని జయించేవారు లేరు. మీ అన్నదమ్ముల ఐకమత్యమే నాకు కావలసింది. అంతకు మించి నేను కోరుకునేదేదీ లేదు,'' అన్నాడు సునీతి.

'మేమెప్పుడూ కలిసే ఉంటామని ప్రమాణం చేస్తున్నాం,'' అన్నారు అన్నదమ్ములు ముక్తకంఠంతో.

ఆ తరవాత ముగ్గురూ కలిసి గురుకులాశ్రమానికి తిరిగి వెళ్ళారు.

ముగ్గురు మిత్రులకూ విద్యాభ్యాసం పూర్తి కావస్తూండగా విద్యాపతి ఒకనాడు సునీతిని చేరబిలిచి, ''నాయనా, నా గురుకులంలో విద్యపూర్తయిందిగాని, నువ్వు నేర్వవలసింది ఇంకా ఎంతో వుంది. నైమిశారణ్యంలో విద్యాసాగరుడి గురుకులాశ్రమానికి వెళ్ళి, నేను పంపానని చెప్పి, అక్కడ మరో మూడేళ్ళు విద్యనభ్యసించిరా. అది నీకు ఎంతో ఉపయోగకరం,'' అన్నాడు.

సునీతి సంతోషంగా మరునాడు ఉదయం నైమిశారణ్యానికి బయలుదేరాడు.

జయవర్మ, అజయవర్మలు విద్య పూర్తి చేసుకుని గురుకులం నుంచి రాజధానికి తిరిగివచ్చారు. అరణ్యంలో జరిగిన ఉదంతాన్ని తండ్రికి ఉత్సాహంగా చెప్పారు. దానిని విన్న తండ్రి, "మీరు సర్పరాజం నుంచి అజేయులని వరం పొందినప్పటికీ, సునీతి తలుచుకుంటే మీకు ఓటమి తప్పదు. బలవంతుడైన శత్రువు తలమీద వేలాడే ఖడ్గం లాంటి వాడు. అలాంటివాడు పక్కనే ఉన్నప్పుడు మీరు అజేయులెలా అవుతారు?" అన్నాడు విచారంగా.

తండ్రి మాటల్లోని నిజాన్ని అన్నదమ్ములు గ్రహించి మౌనంగా ఊరుకున్నారు. అప్పుడు తండ్రి, "నాకు సునీతి మీద కోపం లేదు. నాకతడు పుత్రభిక్ష పెట్టినవాడు. అయితే, స్నేహధర్మం కొద్దీ మీరతన్ని చేరదీస్తే, సర్ప వృత్తాంతం పదిమందికీ తెలిసి, పరాజయ భయంతో చేరదీశారని శత్రువుల మధ్య మీరు అవహేళనకు గురయ్యే ప్రమాదం ఉంది. కేకయ రాజ్యాన్ని రెండుగా విభజించి, చెరో భాగానికి మిమ్మల్ని రాజులుగా చేస్తాను. మీరిద్దరూ ఐకమత్యంతో మసలుకోండి. ఎట్టి పరిస్థితులలోనూ సునీతిని మాత్రం మీ దరి దాపులకు రానీయకండి," అన్నాడు.

అన్నదమ్ములు అందుకు సరేనన్నారు. తన కుమారులిద్దరూ తమ మధ్య కలహించుకోరని తండ్రి సంతృప్తి చెందాడు. కేకయ రాజ్యాన్ని రెండు భాగాలుగా చేసి అన్నదమ్ములిద్దరినీ పట్టాభిషిక్తుల్ని చేశాడు. కొన్నాళ్ళకు ఇద్దరికీ



వివాహాలయ్యాయి. జయవర్మకు కూతురు పుట్టింది. అజయవర్మకు సంతానం కలగలేదు. అందువల్ల, జయవర్మ కూతురినే అతడు తన సొంత కూతురిగా భావించసాగాడు. ఆమెకు అయిదేళ్ళయింది.

అక్కడ నైమిశారణ్యంలోని విద్యాసాగరుడి వద్ద మూడేళ్ళ పాటు ఉన్నత విద్యాభ్యాసం చేసి వింధ్యారణ్యానికి తిరిగి వచ్చిన సునీతి గురువుతో, "నా మిత్రులిద్దరూ ఇప్పుడు రాజులయ్యారు కదా? మీ ఆశీస్సులతో వాళ్ళ ఆస్థానానికి వెళ్ళి ఏదైనా జీవనోపాధి వెతుక్కుంటాను. నా జీవితం సుఖంగా గడిచిపోతుంది," అన్నాడు.

ఆ మాటవిని గురువు కొంత సేపు మౌనంగా ఆలోచించి, "నాయనా, రాజుల చెలిమి పాములతో చెలగాటం వంటిది. దానిని నమ్మ



కూడదు. నాకు వయసు పైబడుతున్నది. నా తదనంతరం నువ్వు ఈ గురుకుల బాధ్యతలు స్వీకరించగలవని ఆశిస్తున్నాను. అందుకే నిన్ను ఉన్నత విద్యకోసం విద్యాసాగరుల వద్దకు పంపాను. ఇక్కడ ఉండడమే నీకు శ్రేయోదాయకం,'' అన్నాడు.

సునీతి మొదట అందుకు అంత ఆసక్తి కనబరచకపోయినప్పటికీ, ఆ తరవాత నెమ్మదిగా ఆలోచించి, గురుకులాశ్రమ బాధ్యతలు స్వీకరించి, సక్రమంగా నిర్వర్తించ సాగాడు. అతడు పెళ్ళి చేసుకోలేదుగాని, గురుకులాశ్రమంలోని విద్యార్థులలో సువీరుడనే ఒక పదేళ్ళ క్షత్రియ కుమారుణ్ణి ఎంపిక చేసి, అతనికి క్షత్రియోచిత విద్యలు నేర్పి చక్కని వీరుడిగా శిక్షణ నివ్వసాగాడు. ఇలా పదేళ్ళు గడిచి పోయాయి.

ఒకనాడు సువీరుడు ఏదో పని మీద కేకయ రాజధానికి వెళ్ళి గుర్రం మీద గురుకులానికి తిరిగి వస్తున్నాడు. అరణ్య ప్రాంతంలో హఠాత్తుగా, ''కాపాడండి, కాపాడండి,'' అన్న స్త్రీ ఆర్తనాదం విని గుర్రాన్ని ఆపి వెనక్కు తిరిగి చూశాడు.

వేగంగా వెళుతూన్న రథంలో ఒక యువతి జోడు గుర్రాలను అదుపు చేయలేక కేకలు పెడుతున్నది. సువీరుడు ఒక్క గెంతున రథంలోకి దూకి గుర్రాలను అదుపు చేసి ఆ యువతిని కాపాడాడు. ఆమె కృతజ్ఞతతో అతడి కేసి చూసింది. కొంతసేపటికి అక్కడికి నలుగురు చెలికత్తెలు రావడంతో, రథంలోని యువతి వనవిహారానికి వచ్చిన కేకయ రాజ్య యువరాణి ఇందువదన అని సువీరుడికి తెలిసింది.

సువీరుడు గురుకులానికి వచ్చి, మార్గ మధ్యంలో జరిగిన విషయం గురించి, గురువుకు చెప్పాడు.

ఆ మాట విని సునీతి పరమానందం చెంది, రెండు రోజుల తరవాత సువీరుణ్ణి వెంటబెట్టుకుని కేకయ రాజధానికి బయలుదేరాడు.

ఆయన్ను చూడగానే జయ, అజయవర్మలిద్దరూ సాదరంగా స్వాగతం పలికారు. ''ఎలా ఉన్నావు మిత్రమా? పాలనా వ్యవహారాలలో తల మునకలుగా ఉండడంతో ప్రాణమిత్రుడివైన నీ మాటే మరిచాం,'' అన్నాడు జయవర్మ.

''నా మిత్రులైన మీరిద్దరూ ప్రజారంజకంగా పాలన చేయడం నాకెంతో ఆనందంగా ఉంది. గురువుగారి తరవాత నేను గురుకులాశ్రమ బాధ్యతలు స్వీకరించడం వల్ల ఇటు రాలేకపోయాను,'' అన్నాడు సునీతి.

పక్కనవున్న యువకుడు ఎవరన్నట్టు అజయవర్మ సువీరుడికేసి చూశాడు.

''అతడు క్షత్రియ కుమారుడు సువీరుడు. నా ప్రియ శిష్యుడు. సాటిలేని మేటి వీరుడు. నాకు పుత్రసమానుడు. అతడి వివాహ ప్రయత్నం మీదే ఇటువచ్చాను. మూడు రోజుల క్రితం, వనవిహారానికి వెళ్ళిన యువరాణి ఇందువదనను చూశానని కూడా చెప్పాడు,'' అన్నాడు సునీతి.

''ఎవరూ? ఇందువదనను ప్రాణాపాయం నుంచి రక్షించిన వీరుడా? ఆ క్షణం నుంచి ఆమె ఇతన్ని గాఢంగా అభిమానిస్తున్నది. ఆమెనిచ్చి సంతోషంగా వివాహం జరిపిస్తాం. స్నేహధర్మాన్ని పాటించిన ప్రాణమిత్రుడివైన నువ్వు, ఈ క్షణం నుంచి మా ఆత్మబంధువు కూడా కావడం పరమానందం కలిగిస్తున్నది,'' అన్నాడు జయవర్మ.

''చాలా సంతోషం. క్షత్రియధర్మాన్ని పాటిస్తూనే, స్నేహధర్మాన్ని మరిచిపోని మీ కీర్తి చిరస్థాయిగా నిలుస్తుంది. సువీరుడి పాలనలో మీ రాజ్య ప్రజలు సర్వసుఖాలూ అనుభవించగలరు,'' అన్నాడు సునీతి.

ఇందువదన, సువీరుల వివాహంతో కేకయ దేశం మళ్ళీ ఒకే రాజ్యమయింది. సువీరుడు ప్రజారంజకంగా రాజ్యపాలన చేసి ముగ్గురు మిత్రులకూ ఆనందం కలిగించాడు.



# ఆలోచన!

ఇరుగుపొరుగు ఇళ్ళవాళ్ళయిన కేశవుడు, రాఘవుడు పుట్టి పెరిగిన పల్లెటూరిని వదిలి, ఏ పట్నానికో వెళ్ళి బతుకుతెరువు వెతుక్కోవాలనుకున్నారు. బయలుదేరే ముందు వాళ్ళకొక చిత్రమైన ఆలోచన వచ్చింది. ''నువ్వు గంగపట్నానికి వెళ్ళు. నేను కృష్ణపట్నానికి వెళతాను. సరిగ్గా ఐదేళ్ళ తరవాత, ఇదేరోజున ఇక్కడే కలుసుకుందాం. ఈ ఐదేళ్ళలో మన జీవితాల్లో ఎలాంటి మార్పువస్తుందో చూద్దాం, ఏమంటావు?'' అన్నాడు కేశవుడు.

రాఘవుడు అందుకు సరేనని గంగపట్నానికి బయలుదేరాడు.

ఐదేళ్ళు గడిచాక మిత్రులిద్దరూ అనుకున్న రోజున గ్రామదేవత ఆలయం వద్ద కలుసుకున్నారు. ''ఎక్కడికి వెళ్ళినా మన నీడ మనవెంటే వస్తుందన్నట్టు, ఊరు వదిలి వెళ్ళినా నాకు రెక్కాడితేగాని, డొక్కాడని పరిస్థితే. ఒక బట్టల దుకాణంలో పనిచేస్తున్నాను. మరి నీ సంగతేమిటి?'' అని అడిగాడు కేశవుడు.

''చెప్పడం దేనికి? రేపు నాతోరా, చూద్దువుగాని,'' అన్నాడు రాఘవుడు.

మూడో రోజు సాయంకాలానికి మిత్రులిద్దరూ గంగపట్నం చేరుకున్నారు. పట్నం చివర పదెకరాలపొలం; ఐదారు కొబ్బరి చెట్ల మధ్య చిన్న భవంతిలాంటి ఇంటికి తీసుకువెళ్ళాడు రాఘవుడు. దాన్ని చూడగానే, ''ఈ ఇల్లు నీదేనా?'' అంటూ ఆశ్చర్యపోయాడు కేశవుడు.

''కాదు. నా దూరపు బంధువుది. ఆయన విదేశానికి వెళుతూ ఈ పొలం, ఇల్లు నాకిచ్చి వెళ్ళాడు,'' అన్నాడు రాఘవుడు.

ఆ తరవాత ఆశ్చర్యంగా చూస్తూన్న కేశవుణ్ణి, ''మనకూ ఇలాంటి బంధువుంటే బావుండేది కదా, అనుకుంటున్నావు. అవునా?'' అని అడిగాడు రాఘవుడు. ''కాదు. నేను ఆ బంధువునై ఉంటే ఎంత బావుండేది అనుకుంటున్నాను,'' అన్నాడు కేశవుడు!

–ధనికొండ శ్రీధర్






# రాకాసిలోయ

## 21

[సారంగ మార్గాన్నుంచి పారిపోయిన చండమండూకుడూ, బ్రహ్మదండి మాంత్రికుడూ కలిసి, పట్టరాని ఉత్సాహంతో అడవి మధ్య వున్న పాడుపడిన బావి దగ్గిర కేశవుడూ, జయమల్లుల కోసం కాపలా వేశారు. కాని, తీరా వాళ్ళు బావి నుంచి పైకి వచ్చే సమయంలో, దాపుల వున్న చెట్ల మీది నుంచి వచ్చిన కేక విని మండూకుడూ, బ్రహ్మదండీ హడలిపోయి అడవిలోకి పారిపోసాగారు. -తరవాత]

కేశవుడూ, జయమల్లూ, కోయయువకుడూ బావి నుంచి పైకి వస్తూనే పారిపోతున్న, చండమండూకుణ్ణీ, బ్రహ్మదండి మాంత్రికుణ్ణీ చూసి ఆశ్చర్యపడ్డారు. వాళ్ళతోపాటు కొందరు అడవిలోకి పరిగెత్తుతున్నారు. అంతలో దాపుల వున్న చెట్ల మీది నుంచి కేశవుడి తండ్రి అయిన ముసలివాడూ, గడేజంగ్ అనుచరుడైన కోయయువకుడూ కిందికి దూకారు. తండ్రిని చూడగానే కేశవుడికి కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు. అతడు చేతులు పైకెత్తి ఉత్సాహంగా ఒక్క కేకపెట్టి, 'అయ్యా' అంటూ ముందుకు పరిగెత్తబోయేంతలో, వెనక పాడుబడ్డ బావిలోంచి రణగొణ ధ్వని వినిపించింది. అప్పటిగ్గాని, కేశవుడికీ, జయమల్లుకూ, తమను సారంగమార్గాన తరుముకు వస్తున్న నరభక్షకుల సంగతి గుర్తుకు రాలేదు. వెంటనే వాళ్ళిద్దరూ, కోయయువకుడూ వెనక్కు తిరిగి బావి కేసి రెండడుగులు వేసేంతలో, ముసలివాడు పెద్దగా నవ్వి, "ఆ దుర్మార్గులిద్దర్నీ హడలగొట్టాను. ఇప్ప చెట్లమీద వున్న ఇరవైమంది, నేరేడు చెట్లచాటున వున్న నలభైయిద్దరూ... అని కేక పెట్టగానే, నీచులు



తారుకు పోయారు. ఇక ప్రస్తుతానికి ప్రమాదం లేదు,'' అంటూ ముందుకు రాబోయాడు.

తన తండ్రికి తమను వెన్నాడి వస్తున్న నరభక్షకుల సంగతి తెలియదని గ్రహించిన కేశవుడు చప్పున వెనుదిరిగి, ''అయ్యా, ఇంకా మనకు ప్రమాదం తొలగలేదు. ఒక మందకు మంద నరభక్షకులు సొరంగ మార్గా న్నుండి ఇటు వస్తున్నారు...'' అని హెచ్చ రించే లోపలే, పదీ పన్నెండు మంది నరభక్ష కులు కీచుమని అరుస్తూ, ఈటెలు పైకెత్తి బావిలోంచి బయిటికి దూకారు. అదే సమ యంలో ముసలివాడూ, కోయయువకుడూ నిలుచున్న చోటుకు వెనకగా వున్న పొదల్లో నుంచి, ''మనం అనవసరంగా భయపడ్డాం. ముసలి వెధవ పెద్ద మోసం చేశాడు. అంతా కలిసి వాళ్ళు అయిదుగురే! చంపండి,'' అన్న చండమండూకుడి కేక వినబడింది.

''కాలభైరవా, ఉపాసకుల ఊడల మర్రీ... ఆ కేశవుణ్ణి చంపకండి! వాణ్ణి ప్రాణాలతో పట్టుకోండి. వాడు చస్తే ఇక మనం బతికివుండీ లాభంలేదు. రాకాసి లోయ... బంగారం.... వెండి.....అర్ధరాజ్యం...'' అంటూ బ్రహ్మ దండినెత్తీ నోరూ కొట్టుకుంటూ అరవసాగాడు.

రెప్పపాటు కాలంలో తను ఆశించిన దానికి భిన్నంగా జరిగిపోవటం చూసి ముసలివాడు ఓ తృటికాలం నిర్విణ్ణుడయ్యాడు. ఎన్నో రోజుల తరవాత తను తన కొడుకును చూడటం జరిగింది. కాని, ఆ ఆనందానికి తను నోచుకో లేదు. ఇప్పుడు తనూ, తన కొడుకూ కూడా నరభక్షకులతో అన్నిటికీ తెగించి పోరాడాలి.

''చిన్న గడేజంగ్! నువ్వేమీ భయపడకు. మన చేతుల్లో కత్తులున్నంతవరకూ మన నెవరూ ఏమీ చేయలేరు. ఊ, మహాచండీ!'' అంటూ ముసలివాడు నరభక్షకులతో పోరుకు తలపడ్డాడు.

ముసలివాడు పెట్టిన ముద్దు పేరుకు తగి నట్టే చిన్న గడేజంగ్ అసహాయ శూరుడు. తమ నాయకుడిలాగే అతడికి ప్రాణభయం అంటే ఏమిటో తెలియదు. అతడు కత్తి దూసి, తనకేసి వస్తున్న నలుగురైదుగురు నర భక్షకుల్ని దెబ్బ కొకడి చొప్పున కింద పడ గొట్టాడు. కాని, నరభక్షకుల సంఖ్య వున్న కొందికీ అధికం అవుతున్నది. చెట్ల చాటు నుంచి మిడతల దండులా వాళ్ళు ముందు కొచ్చి పడుతున్నారు. కేశవుడూ, జయమల్లూ, వాళ్ళ వెంట వున్న కోయయువకుడూ భయం కరంగా పోరాడుతూ క్రమక్రమంగా గుబు రుగా వున్న చెట్ల కేసి తిరోగమించసాగారు.

''జ్యేష్ఠా, కనిష్ఠా! ఇంతమంది దుర్మార్గులతో నిలబడి యుద్ధం చేసి లాభం లేదు. అడవిలోకి పరిగెత్తండి. మేమిద్దరంకూడా అదే చేయబోతున్నాం. మిమ్మల్ని ఏదో విధంగా కలుసుకుంటాను,'' అంటూ ముసలివాడు పెద్దగా కేకపెట్టి, తనను చుట్టుముట్టిన నరభక్షకుల్లో ఇద్దర్ని కత్తితో నరికి అడవి లోపలికి పరిగెత్త సాగాడు. చిన్న గడేజంగ్ కూడా శత్రువుల మధ్య నుంచి దారి చేసుకుంటూ ముసలివాణ్ణి అనుసరించాడు.

ఈలోపల కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడు కూడా, ఇక నరభక్షకులతో నిలిచి యుద్ధం చేయటం ప్రమాదం అని గ్రహించి, ఒకళ్ళకొకళ్ళు రక్షణగా పోరుతూ, కలిసి కట్టుగా నిలబడి గుబురు చెట్ల కేసి పోసాగారు. కాని, నరభక్షకులు మరింతగా కేకలు పెడుతూ వాళ్ళను చుట్టు ముట్టేందుకు ముందుకు వస్తున్నారు.

''ఆ దుర్మార్గులందర్నీ... కేశవుడితో సహా నరకండి. వాణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలని చూసి లాభం లేదు. వాడు అది అవకాశంగా తీసుకుని మనవాళ్ళ నందర్నీ ఊచకోత కోస్తున్నాడు,'' అంటూ చండమండూకుడు అరిచాడు.

''కేశవుణ్ణా... చంపటమా? హా, కాల భైరవా, రాకాసిలోయా!'' అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు పెద్దగా మూలిగాడు.

తన అనుచరులు కేశవుడి చేతిలో చావటం చూస్తున్న మండూకుడికి, ఆ మూలుగు, ఎక్కడలేని కోపాన్నీ తెప్పించింది. వాడు కళ్ళెర్ర చేసి, తన చేతి కర్రతో బ్రహ్మదండి



డొక్కలో ఒక్క పోటు పొడుస్తూ, ''ముసలి మంత్రాల పీనుగా! నువ్వు, ఈ లంకకు మహమ్మారిలా దాపురించావ్. అర్ధరాజ్యం, ధన రాసులూ అంటూ నాకు ఆశ చూపి, నా అనుచరులందర్నీ, ఆ కేశవుడి కత్తికి బలి అయ్యేలా చేస్తున్నావ్. నిన్ను బతికుండగానే చర్మం వొలిపించి, డప్పు కట్టిస్తాను,'' అన్నాడు.

మండూకుడి కర్ర దెబ్బ తింటూనే బ్రహ్మదండి పెద్దగా కేక పెట్టి, ''నరభక్షకేశ్వరా! తమ కొయ్య కరవాలంతో అంత ధాటీగా పొడవకండి. నేను శరీరంలో ప్రాణం వుండికాక, కేవలం మంత్రాల బలంతో బతుకుతున్నాను. తమరు శెల విచ్చినట్టు నేను, ముసలి... వయోవృద్ధుణ్ణి కాను; మంత్ర వృద్ధుణ్ణి!'' అన్నాడు.

''ఏడ్చి మొత్తుకున్నావ్! అంత మంత్రశక్తి వున్నవాడివైతే, అదుగో, ఆ కేశవుడూ వాళ్ళు,



నా అనుచరుల్నుంచి తప్పుకుని అడవిలోకి పారిపోతున్నారు. వాళ్ళను నిలువరించు, చూతాం!'' అన్నాడు మండూకుడు, చేతి కర్రను మళ్ళీ బ్రహ్మదండి డొక్కకేసి గురిపెట్టి.

బ్రహ్మదండి రెండు చేతులతో మండూకు డికి నమస్కరించి, వణికిపోతూ, ''నరభక్షక శమంతకమణీ! తమ హస్తదారుకాన్ని కాస్త వెనక్కు మళ్ళించండి. సరి... కావాలంటే ఆ కేశవుణ్ణీ వాడి అనుచరులనూ వున్న చోటునే నిలువునా భస్మం చేయగలను. ఈ లంకను అలా గాలిలోకి లేపి క్షీరసాగరం మధ్య దించగలను. అష్టగ్రహ కూటమి కల్పించి, సముద్రాలను పొంగించి, లోకాన్ని....''

బ్రహ్మదండి వాచాలతకు రెచ్చిపోయిన చండమండూకుడు తన చేతికర్రతో అతడి భుజాన గట్టిగా ఒక్క పోటు పొడిచి, ''ఇక నీ వాగుడు కట్టిపెట్టు!'' అంటూ తన కేసి పరిగెత్తి వస్తున్న అనుచరులను కలుసుకునేం దుకు ముందుకు నడిచాడు.

రొప్పుతూ రోస్తూ వచ్చిన నలుగురైదుగురు నరభక్షకులు తమ వంటిమీది గాయాలను, చండమండూకుడికి చూపుతూ, ''మహా మండూకా! మా చేతనైనదంతా చేశాం. కాని ఆ దుర్మార్గులు మన వాళ్ళల్లో చాలా మందిని చంపి, మండూక పర్వతాల కేసి పారి పోయారు,'' అన్నారు.

చండమండూకుడు ఆ మాటలు వింటూనే నిలువెల్లా కంపించాడు. అతడికి కేశవుడూ, జయమల్లుల నుంచి తనకు ప్రాణగండం కలగ వచ్చున్న భయం పట్టుకున్నది. ఒకసారి వాళ్ళ నుంచి ఎలాగో చావు తప్పించుకు పారిపోగలిగాడు. పైగా వాళ్ళకు తన రహస్య సొరంగం గురించి కూడా తెలిసిపోయింది...

''ఆ దుర్మార్గులు ముగ్గురూ కొండల్లోకి పారిపోయారు! ఈ ముసలివాడూ, వాడి వెంట వున్న కోయ వెధవా, అడవుల్లోకి పారి పోయారు! ఇంతమంది మీరుండి, వాళ్ళ నెలా పారిపోనిచ్చారు?'' అంటూ మండూ కుడు తన అనుచరల్ని నానా తిట్లూ తిట్టి, ''ఇక వెళ్ళండి! రేపు సూర్యోదయం లోపల వాళ్ళు అయిదుగురినీ గాలించి పట్టుకు రావాలి. వాళ్ళ శవాలను నాకు తెచ్చి చూపినా ఫరవాలేదు. అలా జరగక పోయిందో....'' అంటూ చేతి కర్రను గట్టిగా తాటించాడు.

''ఆ కేశవుణ్ణి మాత్రం....'' అంటూ ఏమో చెప్పబోయిన బ్రహ్మదండి, మండూకుడి రౌద్రాకారం చూసి గట్టిగా నోరు మూసుకు న్నాడు. మండూకుడు ఆశ్చర్యంగా చుట్టూ

కలయ చూసి, తరవాత బ్రహ్మదండి కేసి తల తిప్పి, "అన్నట్టు నీ అంగరక్షకులిద్దరూ ఎక్కడా కనిపించరేం? వాళ్ళేటయినా పారి పోలేదు గదా!" అన్నాడు అనుమానంగా.

చండమండూకుడి మాటలు వింటూనే బ్రహ్మదండి ఉలిక్కి పడ్డాడు. అతడికీ ఇంత వరకూ జిత, శక్తి వర్మలను గురించిన ఆలోచనే రాలేదు. తనను ఈ నరభక్షకులకు వదిలి, వాళ్ళిద్దరూ క్షేమంగా ఈ లంక నుంచి పారి పోయారా అన్న అనుమానం అతడికి కలి గింది. ఆ వెంటనే బ్రహ్మదండి పెద్దగా గొంతెత్తి, "జితా, శక్తీ! ఎక్కడ?" అంటూ కేక పెట్టాడు.

ఆ వెంటనే అల్లంత దూరాన వున్న చెట్ల మీది నుంచి, "వస్తున్నాం బ్రహ్మదండీ, వస్తున్నాం!" అంటూ జిత, శక్తివర్మలు బదులు కేక పెట్టి, కోతుల్లా కొమ్మల్లో నుంచి కిందికి దూకారు.

"ఇక్కడ ఇంత భయంకర పోరు జరుగు తూంటే, మీరు పిరికిపందల్లాగా చెట్లల్లో దాక్కున్నారన్న మాట!" అన్నాడు చండ మండూకుడు కోపంగా.

"చెట్లల్లో దాక్కోవటమా! మేమా?" అంటూ జిత శక్తివర్మలు జబ్బలు చరుస్తూ దగ్గరికి వచ్చి, "ఆ జయమల్లు ఎడమ చేతిని నరికిం దెవరు? ఆ ముసలివాడి ముక్కు ఎగిరి కిందపడేలా కత్తి విసిరిందెవరు? మేమే! మేమే!" అన్నారు.

చండమండూకుడు వాళ్ళద్దరి కేసీ అను మానంగా చూశాడు. బ్రహ్మదండి ముఖం చిట్లించి, "అలాగా, ఆహా! నే ననుకుం టూనే వున్నాను. మీరు శూరులు, వీరులు!



సరే, ఇకవెళ్ళి ఆ దుర్మార్గులు కొండల్లోకి పారి పోయారట, వెతికి పట్టుకురండి!" అంటూ మండూకుడు చూడకుండా వాళ్ళకు సౌంజ్ఞ చేశాడు.

బ్రహ్మదండీ, చండమండూకుడూ ఈ విధంగా ఇక్కడ గొడవ పడుతూంటే, నరభక్ష కుల నుంచి తప్పుకు పారిపోయిన కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడూ లంకలోని కొండ ప్రాంతాలకు చేరి, దాక్కునేందుకు అనువైన గుహ కోసం వెతకసాగారు. ఒక్క కేశవుడికి తప్ప, తతిమ్మా ఇద్దరికీ నరభక్షకు లతో జరిగిన పోరులో గాయాలు తగిలినై. అన్నీ చిన్న చిన్న గాయాలు, పెద్ద ప్రమాద మైనవేం కాదు. కోయయువకుడు తనకు తెలిసిన మూలికలూ, ఆకులూ కలిపి తన గాయాలకూ జయమల్లు గాయాలకూ, కట్లు కట్టాడు.

కొండ దిగువ నుంచి వస్తున్న హెచ్చరికలూ, కేకలూ వల్ల నరభక్షకులు తమను పట్టుకునేందుకు కొండలు గాలిస్తున్నారని కేశవుడికీ, అతడి అనుచరులకూ తెలిసిపోయింది. కేశవుడికి లోలోపల తన తండ్రిని గురించిన విచారం పట్టుకున్నది. అతడు నరభక్షకులకు దొరకకుండా పారిపోయి వుంటాడా?

''కేశవా! నీ తండ్రిని గురించి దిగులు పెట్టుకోకు. అతడు మనలాగే అడవుల్లోకి సురక్షితంగా పారిపోయి వుంటాడని నా నమ్మకం. ఇదుగో, మనం ఈ గుహలో దాక్కుందామా?'' అంటూ జయమల్లు కొంచెం ముందుకు వెళ్ళి అక్కడ రాళ్ళలో వున్న చిన్న కంతలో నుంచి లోపలికి చూశాడు.

మనిషి పట్టీపట్టనంత సన్నగా వున్న కంతలో నుంచి మెల్లిగా జొరబడి ముగ్గురూ ఆ వెనక కొంచెం విశాలంగా వున్న గుహలోకి వెళ్ళారు.

గుహలో అడుగు పెడుతూనే కోయ యువకుడు ఎగిరి గంతేసి, ''ఇక్కడేవో రెండు శవాలున్నవి!'' అన్నాడు భయంగా.

జయమల్లు గుహ లోపలి భాగంలోకి నిదానంగా పరకాయించి చూశాడు. అక్కడ అతడికి రెండు మానవ కంకాళాలు కనిపించినై. అతడు నవ్వుతూ, ''అవి శవాలు కావు; వట్టి బొమికల గూళ్ళు. భయపడకు, వాటికీ సున్నం పోగులకూ తేడా ఏమీలేదు, మనం....''

జయమల్లు మాట పూర్తి చేసే లోపలే 'బుస్' మంటూ పెద్ద శబ్దం అయింది. ఆ మరుక్షణాన ఫెళఫెళ మంటూ ఒక రాయి గుహ వెనక నుంచి లోపలికి దభీమంటూ పడింది. గుహ అంతా వెలుగుతో నిండిపోయింది. కేశవుడూ అతడి అనుచరులూ అక్కడికి పరిగెత్తి బయిటికి తొంగి చూశారు. వాళ్ళకు కలిగిన భయాశ్చర్యాలు అంతా ఇంతా కాదు.

ఒక మహాసర్పం, వాళ్ళు కనీ వినీ ఎరుగని ఒక భయంకర మృగంతో చావు బతుకుల పోరు జరుపుతున్నది. సర్పం కొట్టే బుసలూ, భయంకర మృగం పెట్టే భీకరమైన అరుపులూ విని ముగ్గురూ ప్రాణభయంతో తల్లడిల్లిపోయారు. -(ఇంకావుంది)



బేతాళ కథలు

# ఉత్పలాక్షి ప్రేమ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఏ ఉదాత్త లక్ష్య సాధన కోసం, ఏ ప్రజల క్షేమం కాంక్షించి నువ్వు అర్ధరాత్రి సమయంలో ఇలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, సామాన్య ప్రజల క్షేమమే జీవిత లక్ష్యంగా భావించే పాలకులు సైతం, ఒక్కొక్కసారి రాజ్యకాంక్ష కారణంగా అటువంటి లక్ష్యానికి తిలోదకాలు వదులుతూ ఉంటారు. హఠాత్తుగా అలాంటి మానసిక పరివర్తనకు లోనైన వజ్రపాణి అనే యువకుడైన రాజు కథ

Sankar



చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

గిరివ్రజపురాన్ని పరిపాలించే ఉగ్రసేనుడి కుమారుడు వజ్రపాణికి బాల్యం నుంచే రాజ్య పరిపాలనా వ్యవహారాల పట్ల ఆసక్తి మెండుగా ఉండేది. అతడు యుక్తవయస్కుడయ్యేసరికి సకల క్షత్రియోచిత విద్యలనూ క్షుణ్ణంగా అభ్యసించాడు. తండ్రికి పాలనా విషయాల్లో అప్పుడప్పుడూ విలువైన సలహాలు ఇచ్చేవాడు. ఆ సలహాల వెనక సూక్ష్మ పరిశీలన, దూరదృష్టి, వయసుకు మించిన వివేకం ఉండడం గమనించి తండ్రి ఆనందాశ్చర్యాలు చెందేవాడు. తన కుమారుడు అసాధారణ మేధావి, సర్వసమర్థుడు అని ఆయన అచిర కాలంలోనే గ్రహించాడు. తన కుమారుడి పాలనలో ప్రజలు ఎలాంటి కొరతా లేకుండా సుఖపడగలరని భావించడం వల్ల, అతనికి సర్వాధికారాలు అప్పగించి సింహాసనాధిష్ఠుణ్ణి చేసి, తాను విశ్రాంతి తీసుకున్నాడు.

వజ్రపాణి రాజైన తరవాత ఒక్క క్షణం కూడా విశ్రమించలేదు. మంత్రి, సేనాధిపతి, సైన్యం, ఇతర అధికార గణాన్ని రాజ్యాన్ని ప్రగతి పథంలో నడిపించే బృహత్కార్యంలో భాగస్వాములుగా చేశాడు. సమృద్ధిగా సాగు నీటి సౌకర్యాలు కల్పించి వ్యవసాయాన్నీ; నూతన పరికరాలను తెప్పించి కుటీర పరిశ్రమలనూ అభివృద్ధి పరిచాడు. సోమరితనాన్ని నిర్మూలించడం కోసం ప్రతి ఒక్కరికీ పని తప్పనిసరి చేశాడు. ఆఖరికి ఖైదీలందరికీ శిక్షణనిచ్చి, పరిమిత స్వేచ్ఛ కల్పించి, వాళ్ళ దృష్టిని సంపాదనవైపు మళ్ళించాడు. అకుంఠిత దీక్షతో కృషి చేసి మూడేళ్ళలో దేశాన్ని సుసంపన్నం చేశాడు.

ఇలా ఒక నిర్దిష్ట లక్ష్యాన్ని చేరుకున్న తరవాత వజ్రపాణి తన వివాహం గురించి ఆలోచించడం మొదలు పెట్టాడు. ప్రజా క్షేమమే జీవిత లక్ష్యంగా భావించిన తాను తన రాజ్యానికి చెందిన ఒకసామాన్య యువతిని వివాహం చేసుకుని ప్రజలతో మమేకం కావాలని ఆశించాడు.

కాబోయే రాణి విద్యావివేక సంపన్నురాలుగా ఉండాలి గనక, రాజ్యంలోని యువతులకు తెలివితేటల పోటీ నిర్వహించి, అందులో విజేతగా వచ్చే యువతిని వివాహమాడగలనని ప్రకటించాడు!

రాణి కావాలన్న కోరికతో పలువురు యువతులు పోటీలలో పాల్గొనడానికి వచ్చారు. జ్ఞాపకశక్తి లోనూ, గణితంలోనూ, క్రీడలలోనూ పోటీ పరీక్షలు నిర్వహించారు. పోటీలలో చివరికి నీలోత్పల, శివదర్శిని అనే ఇద్దరు యువతులు సమ ఉజ్జీలుగా నిలిచారు. తరవాత ఎన్ని పరీక్షలు పెట్టినా ఎవరూ వెనక్కు తగ్గలేదు. నీలోత్పల అపురూప సౌందర్యవతి. శివదర్శిని సాధారణ అంద చందాలుగల యువతి.

ఆ ఇరువురిలో ఒకరిని ఎంపిక చేసుకునే బాధ్యతను రాజు వజ్రపాణి స్వయంగా స్వీకరించాడు. ''మీలోని శౌర్య పరాక్రమాలు ఏపాటివో తెలుసుకోదలిచాను. ఏడు గుర్రాల వీరుణ్ణి పట్టి బంధించి తీసుకురండి, చూద్దాం,'' అన్నాడు రాజు వారితో.

ఒక్క క్షణం ఆలోచించిన ఆ ఇద్దరు యువతులు, అక్కడ ఉంచిన రెండు పళ్ళెరాల్లో, నీళ్ళు నింపి మిట్ట మధ్యాహ్న సూర్యుడి ప్రతిబింబంతో తెచ్చి రాజుకు అప్పగించారు. ఏడుగుర్రాల వీరుడంటే సూర్యుడు. అతణ్ణి పట్టి బంధించడమంటే సూర్యుడి ప్రతిబింబాన్ని పట్టుకు రావడమే!

అంతవరకు ఆ ఇద్దరు యువతులను పరిశీలనగా చూస్తున్న రాజులో ఉన్నట్టుండి ప్రగాఢమైన అనుమానం రావడంతో, 'మొదట మీ కుటుంబాల నేపథ్యం నాకు తెలియాలి. మీ తల్లి తండ్రులెవరో చెప్పండి. అది తెలిశాక చివరిపోటీ నిర్వహించి, అందులో నెగ్గినవారిని అర్ధాంగిగా స్వీకరిస్తాను,'' అన్నాడు.



ఆ మాటకు నీలోత్పల ఉలిక్కిపడి, ''తల్లి తండ్రులు ఎవరైతేనేం? మొదట ఆ చివరి పోటీ ఏదో నిర్వహించండి ప్రభూ,'' అన్నది అమిత ఆతృతతో.

రాజు శివదర్శిని కేసి చూశాడు.

''రాజధానికి తూరుపున ఉన్న రామవరం గ్రామం రైతుకుటుంబానికి చెందినదాన్ని. తండ్రి పేరు భూషయ్య. తల్లి నాగమణి,'' అన్నది ఆమె.

రాజు మళ్ళీ నీలోత్పలకేసి తిరిగి, ''నీ తల్లిదండ్రుల పేర్లు చెప్పడానికి సంశయిస్తున్నావంటే, అందులో ఏదో రహస్యం ఉన్నట్టే కదా?'' అని అడిగాడు.

''అవును, ఉన్నది. నేను కోసలరాజ్య యువరాణి ఉత్పలాక్షిని. నీ మీద అభిమానం పెంచుకుని నిన్ను వివాహమాడాలని



వచ్చాను. రాజువైన నువ్వు ఒక సామాన్యు రాలిని వివాహమాడడం నాకేమాత్రం ఇష్టం లేదు. నా ప్రేమ నెగ్గడం కోసం ఇలా మారు వేషం వేయక తప్పలేదు. అది పెద్ద అప రాధమా?'' అన్నది ఆమె ఆవేశంతో.

''ఇది మా రాజ్యంలోని సామాన్య యువ తులకు మాత్రమే నిర్వహిస్తున్న పోటీ. ఇందులో పొరుగు రాజ్యం యువరాణి పాల్గొ నడం భావ్యం కాదు కదా?'' అన్నాడు రాజు నెమ్మదిగా.

''వరించి వచ్చిన అన్ని విధాలా అర్హురా లైన సాటి రాకుమారినైన నన్ను కాదనడం మాత్రం భావ్యమవుతుందా? నువ్వు దీనికి తగ్గ మూల్యం చెల్లించక తప్పదు,'' అంటూ ఉత్పలాక్షి అక్కడి నుంచి విసురుగా వెళ్ళి పోయింది.

వజ్రపాణి గంభీరంగా తల పంకిస్తూ ఆమె కేసి చూడసాగాడు.

శివదర్శిని ఏమి చేయడానికీ తోచక అక్కడి నుంచి వెనుదిరిగింది.

వజ్రపాణి అంతకు ముందెన్నడూ ఉత్ప లాక్షిని చూడలేదు. కానీ, ఆమె గురించి చాలా విన్నాడు. ఆమె కోసలరాజు అమ రేంద్రుడి ఏకైక పుత్రిక. తండ్రికి ఆమె పట్ల అపరిమితమైన వాత్సల్యం. అమరేంద్రుడు పేరుకు రాజే తప్ప, సదా సర్వవేళలా చద రంగం ఆడడంలో నిమగ్నుడై ఉండేవాడు. అందువల్ల రాజ్యాధికారమంతా కుమార్తె ఉత్పలాక్షి చేతిలోనే ఉండేది. ఆమె ప్రజల క్షేమం గురించి ఏమాత్రం పట్టించుకునేది కాదు. మంత్రుల సలహాలను వినేది కాదు. నేరస్థులు పెరిగి పోవడంతో, అమాయకులు బాధ పడుతున్నారు. ఆమె పాలనలో కోసల రాజ్య ప్రజలు అష్టకష్టాలు అనుభవిస్తు న్నారు.

అటువంటి ఉత్పలాక్షి పొరుగు రాజైన వజ్రపాణి శౌర్య పరాక్రమాలు, విద్యా వివే కాలు, అందచందాలు గురించి విని ఆయన మీద అభిమానం పెంచుకున్నది. ఎలాగైనా పెళ్ళాడి తీరాలన్న పంతం పట్టి, మారు వేషంలో వచ్చి పోటీల్లో పాల్గొన్నది. కాని పట్టు బడి భంగపడడం భరించరాని అవమానంగా భావించింది. తిరిగి వెళ్ళి, తండ్రికి జరిగిన సంగతి చెప్పి కన్నీరు కార్చింది.

తండ్రి అమరేంద్రుడు ఆమె దుఃఖాన్ని చూసి భరించలేక పోయాడు. కోసలరాజ్యం

గిరివ్రజపురానికన్నా సువిశాలమైనది. సైనిక బలం కూడా చాలా ఎక్కువే. వజ్రపాణి మీదికి దండెత్తడం చాలా తేలికైన పనే. అయినా అమరేంద్రుడు ఆ పని చేయదలచ లేదు. తొందర పడకుండా సంయమనంతో ఆలోచించాడు. ఎలాగైనా తన గారాలపట్టి కోరిక నెరవేర్చాలని భావించాడు. వృద్ధ మంత్రిని పిలిచి సమస్య పరిష్కారం కోసం కూలంకషంగా చర్చించాడు. ఆ తరవాత ఆయన ద్వారానే వజ్రపాణికి ఒక లేఖను పంపాలని నిర్ణయించాడు.

మరునాడే వృద్ధమంత్రి రాజుగారి లేఖతో గిరివ్రజపురానికి దూతగా బయలుదేరాడు. వజ్రపాణి ఆ లేఖను అందుకుని చదివాడు: ''చిరంజీవి గిరివ్రజపురరాజు వజ్రపాణికి కోసల ప్రభువు అమరేంద్రుడి శుభాశీస్సులు. తమరు విధించిన నిబంధనకు విరుద్ధంగా, పోటీలలో పాల్గొని, దురుసుగా ప్రవర్తించి నందుకు నా కుమార్తె ఉత్పలాక్షి తరఫున నేను క్షమాపణలు చెబుతున్నాను. తమ పట్ల పెంచుకున్న ప్రేమ కారణంగానే ఆమె ఆ సాహసానికి పూనుకున్నది. నా కుమార్తె సుఖ సంతోషాలకు మించినది నాకు ఈ ప్రపం చంలో వేరొకటి లేదు. ఆమె ప్రేమను మన్నించి తమరు పాణిగ్రహణం చేసినట్టయితే మా కోసల రాజ్యం తమదే అవుతుంది. ఉభయ రాజ్యాలకూ తమరే ప్రభువు కాగలరు. వివేక సంపన్నులైన తమరిని వివాహ మాడితే, నా కుమార్తె జీవితం సక్రమ మార్గంలో సుఖ మయం కాగలదని ఆశిస్తున్నాను. నేను



చదరంగం ఆడుకుంటూ, మీ తండ్రిలాగా నా శేషజీవితాన్ని ప్రశాంతంగా గడిపేస్తాను.''

వజ్రపాణి కొంతసేపు తీవ్రంగా ఆలోచించాడు. ఆ తరవాత ఉత్పలాక్షిని వివాహమాడ డానికి సమ్మతిస్తున్నట్టు అమరేంద్రుడికి ప్రత్యుత్తరం పంపాడు. త్వరలోనే వజ్రపాణి, ఉత్పలాక్షిల వివాహం ఘనంగా జరిగింది. సువిశాలమైన కోసల రాజ్యాన్ని గిరివ్రజ పురంతో కలుపుకుని వజ్రపాణి ఉమ్మడి రాజ్యానికి ప్రభువయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తమ రాజ్యానికి చెందిన ఒక సామాన్య యువతిని పెళ్ళాడతానని ప్రకటించిన గిరివ్రజపుర రాజు వజ్రపాణి, చివరికి పోటీల్లో విజేత అయిన సామాన్య యువతి శివదర్శినిని కాదని దుర హంకారి అయిన కోసల రాజ్య యువరాణి

ఉత్పలాక్షిని వివాహమాడడం మాట తప్పడం కాదా? తెలిసీ ఒక దురహంకారిని వివాహ మాడడం వివేకం అవుతుందా? ఆయనలో నిద్రాణమైవున్న రాజ్యకాంక్షే ఈ విపరీత నిర్ణ యానికి పురికొల్పిందా? లేక కోసలరాజ్య సైనిక బలానికి భయపడి ఈ వివాహానికి తల ఒగ్గాడా? ఇవన్నీ కాకుండా ఆయన నిర్ణయా నికి బలమైన కారణం మరేదైనా ఉన్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ప్రజాక్షేమాన్ని పరిరక్షించడమే పాలకుల ప్రధాన కర్తవ్యం అని విశ్వసించిన ఆదర్శ పాలకుడు వజ్రపాణి. బాల్యం నుంచే ఆయనలో ఈ భావం దృఢంగా బలపడుతూ వచ్చింది. అందుకోసమే అహర్ని శలు కృషిచేశాడు. మిగిలినవన్నీ ఆయనకు ముఖ్యం కాదు. కోసలరాజు లేఖను చదవ గానే, మొదట ఆ దేశ ప్రజలు పడుతూన్న బాధలే వజ్రపాణి కళ్ళ ముందు కదలాడి ఉంటాయి. వారి బాధలు పోగొట్టడానికి ఉత్పలాక్షిని వివాహమాడడం మంచి అవ కాశంగా భావించడం వల్లే అందుకు అంగీక రించాడు. అంతేగాని, రాజ్యకాంక్షవల్ల కాదు. సైనిక బలానికి భయపడి కాదు. తండ్రి అతి గారాబం కారణంగా దురహంకారిగా పెరిగి నప్పటికీ, యువరాణి ఉత్పలాక్షి, విశిష్ట గుణ గణాలుగల వజ్రపాణిని అభిమానించి మన సారా కోరుకున్నది. తను అంతగా ఆరాధించే భర్తకు ఆమె బాసటగా నిలబడగలదనడంలో ఏమాత్రం సందేహంలేదు. ఇక మాట తప్పడం గురించి. సామాన్య యువతిని పెళ్ళాడమని ఆయననెవరూ కోరలేదు. అది ఆయన తనకు తానే తీసుకున్న నిర్ణయం. శివదర్శినిని వివాహమాడితే, అది ఆమె ఒక్కతెకు మాత్రమే ప్రయోజనం. ఉత్పలాక్షిని వివాహమాడడం వల్ల కోసల, గిరివ్రజపుర ప్రజలందరికీ ప్రయో జనం. ప్రజాక్షేమం అన్న విస్తృత ప్రయోజనం దృష్ట్యా అది మాట తప్పినట్టు కాదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడు రచన]






# అతిపెద్ద మహిళల సమావేశం

తిరువనంతపురం సమీపంలోని అట్టుక్కల్ అనే చోట ఒక భగవతి గుడి ఉన్నది. ఇక్కడి దేవతను కణ్ణగి దివ్యస్వరూపంగా భక్తులు విశ్వసిస్తారు. కేరళరాష్ట్రం కొడుంగల్లూరులో కణ్ణగి ఆలయం ఉన్నది. సిలప్పదిగారం అనే సుప్రసిద్ధ తమిళకావ్యం కణ్ణగి వృత్తాంతాన్ని అద్భుతంగా వివరిస్తుంది. జీవితంలో తొలిపొద్దున చేసే మంచిచెడ్డలు మలిపొద్దున తప్పక ఫలించి తీరుతాయన్న సత్యాన్ని చాటిచెప్పేసిలప్పదిగారకావ్యాన్ని ఇళంగో అడిగళ్ రచించాడు.

కణ్ణగి తన భర్త కోవలన్‌కు జరిగిన దురన్యాయానికి ప్రతీకార చర్యగా ప్రాచీన నగరం మదురైని అగ్నికి ఆహుతి చేసి పశ్చిమ దిశగా నడిచిందట. మార్గమధ్యంలో ఆమె అట్టుక్కల్‌ను సమీపిస్తూండగా, అక్కడి స్త్రీలు ఆమెకు ఆదరంతో ఆతిథ్యమిచ్చారట.

ఆ సంఘటనకు గుర్తుగా యేటా మార్చ్ నెలలో ఒక రోజు అట్టుక్కల్ చుట్టు పక్కల వాళ్ళే కాకుండా దేశం నలుమూలల నుంచీ అసంఖ్యాకంగా స్త్రీలు వచ్చి ఇక్కడ పొంగళ్ళు పెడతారు. దేవాలయం నుంచి తెచ్చిన నిప్పుతో పూజారులు రాళ్ళ పొయ్యిలను రగిలిస్తారు. ఈ మార్చ్ 3వ తేదీ జరిగిన 'అట్టుక్కల్ పొంగల్'కు దాదాపు ఇరవై అయిదు లక్షల మంది మహిళలు హాజరయ్యారని ఒక అంచనా. దీనిని అతి పెద్ద మహిళల మత సంబంధమైన సమావేశంగా చెప్పవచ్చు.






# నిద్రపట్టని పిశాచం

శివపురం గ్రామానికి కొంత దూరాన ఒక చిట్టడవి ఉండేది. ఆ అడవి మొదట్లో దట్టంగా ఉన్న చెట్ల మధ్య కొన్ని పిశాచాలు చేరి కాలక్షేపం చేస్తుండేవి. అక్కడికి కొత్తగా వచ్చిన కిచకిచ అనే పిశాచానికి నిద్రపట్టని జబ్బు దాపురించింది. తోటి పిశాచాలన్నీ రాత్రంతా జాగారం చేసి పగలంతా హాయిగా నిద్రపోతూంటే, తనకు మాత్రం నిద్రపట్టక పోవడంతో కిచకిచ దిగులుపడి తన సమస్యను తనకు అప్పుడే పరిచయమైన కింకిణీ పిశాచంతో చెప్పుకున్నది.

అప్పుడు కింకిణి, ''బాధ పడకు. నిద్రపట్టడానికి నా దగ్గర చాలా కిటుకులున్నాయి,'' అంటూ ఒక కిటుకు చెప్పింది. దాని ప్రకారం కిచకిచ చింతచెట్టుకు తల్లకిందుగా వేలాడుతూ నిద్రపోయే ప్రయత్నం చేసింది కానీ, అది ఫలించలేదు.

ఆ తరవాత, కింకిణి, ''బాధపడకు. శివపురంలో రంగాచారి అనే గొప్ప వైద్యుడున్నాడు. మనిషి రూపంలో వెళ్ళి, అతన్ని కలిసి నీ జబ్బు గురించి చెప్పు. చిటికలో మాయం చేస్తాడు,'' అని సలహా ఇచ్చింది.

కిచకిచ రైతు రూపంలో వైద్యుడి వద్దకు వెళ్ళింది. దాన్ని చూడగానే వైద్యుడు, ''నీ ముఖంలో జీవకళలేదు. జబ్బేమిటో చెప్పు,'' అన్నాడు.

కిచకిచ నిద్రపట్టని వైనం గురించి వివరించడంతో, వైద్యుడు మందిచ్చి పంపాడు. ఆ మందు వాడాక కిచకిచకు నిద్రపట్టకపోగా, విపరీతంగా కళ్ళు తిరగడం మొదలైంది. దాంతో అది కింకిణీ పిశాచాన్ని వెతుక్కుంటూ వెళ్ళి తన గోడు వెళ్ళబోసుకుంది. అది విన్న కింకిణీ పిశాచం, ''నీకేదో మాయరోగం దాపురించింది. ఇక కిటుకులు చెప్పడం నావల్ల కాదు,'' అని ఆవులిస్తూ ఎటో ఎగిరి వెళ్ళిపోయింది.

కిచకిచ ఏం చేయడానికీ తోచక దిగులుగా తను ఉంటూన్న చెట్టువద్దకు తిరిగి వస్తూ,

ఎస్. శివనాగేశ్వరరావు

ఒక చెట్టు బోదెకు ఆనుకుని అదమరచి నిద్ర పోతూన్న ఒక మధ్యవయస్కుణ్ణి చూసింది. అసూయతో ఒక ఎండుపుల్లను విరిచి అతని మీదికి వేసింది. కళ్ళు తెరిచిన ఆ వ్యక్తి ఎదురుగా పిశాచం ఉండడం చూసి ఉలిక్కి పడి, ఒక్క క్షణం భయపడ్డాడు. ఆ తరవాత దాని వాలకం చూసి ధైర్యం కూడదీసుకుని, ''పిశాచ మిత్రమా, నాపేరు కిష్టయ్య. ఊరు శివపురం. నువ్వు మరీ దిగులుగా కనిపిస్తున్నావు. నీకు వచ్చిన కష్టం ఏమిటో చెప్పు. తీర్చగలిగినదైతే తీరుస్తాను,'' అన్నాడు అతడు.

కిచకిచకు కిష్టయ్య ఆపద్బాంధవుడిలా కనిపించాడు. తనకు నిద్రపట్టని కష్టం గురించి చెప్పుకున్నది.

అంతా శ్రద్ధగా విన్న కిష్టయ్య, ''కొన్నాళ్ళ క్రితం నాకూ ఇలాంటి కష్టమే వచ్చింది. నివారణోపాయం కోసం ఎక్కడెక్కడో తిరిగాను. ఎందరెందరో వైద్యుల్ని చూశాను. వాళ్ళు చెప్పిన వైద్యాలన్నీ చేశాను. ఇచ్చిన మందులన్నీ వాడాను. కాని ప్రయోజనం లేకపోయింది. ఆఖరికి ఒక సన్యాసి చెప్పిన ఉపాయం గొప్పగా పనిచేసింది,'' అన్నాడు.

''ఏమిటది?'' అని అడిగింది కిచకిచ ఆత్రుతగా.

''పగలంతా పాటలు పాడుతూ గడిపితే, రాత్రి పూట బాగా నిద్రపట్టేది. కాకుంటే నాపాట వినలేక గ్రామస్థులు నన్ను తరిమి కొట్టారు. అది వేరే విషయం. ఈ రాత్రికి నువ్వు నోరు తెరిచి పెద్దగా ఆనందంగా పాటలు పాడు. రేపు పగలంతా నిద్రపట్టకపోతే నా మీద ఒట్టు. నీ కష్టం తీరేవరకు నేను ఇక్కడే ఉంటాను,'' అన్నాడు కిష్టయ్య. ''నువ్వు






చెప్పినట్టే చేస్తాను. బాగా నిద్రపడితే నీకు విలువైన కానుకలిస్తాను,'' అన్నది కిచకిచ.

సూర్యాస్తమయమై చీకటి పడగానే కిచకిచ గొంతెత్తి పాడడం ప్రారంభించింది. ఆ పాట కర్ణకఠోరంగా ఉండడంతో కిష్టయ్య భరించ లేక పోయాడు. దాన్నుంచి తప్పించుకునే మార్గం తోచక భయపడి పోయాడు. అంతలో అతనికి, తన పాట భరించలేక తనను ఊరి నుంచి తరుమగొట్టిన తన గ్రామస్థులు జ్ఞాపకం రావడంతో, పగసాధించడానికి చక్కని అవకాశంగా భావించి, ''నీ పాట మధురాతి మధురంగా ఉంది. నీ మధురగానాన్ని శివపుర గ్రామస్థులకు వినిపించు. పాటను చెట్టు చేమలకు వినిపించడంకన్నా, మనుషులకు వినిపిస్తే, ఫలితం రెట్టింపుగా ఉంటుంది,'' అన్నాడు పిశాచంతో.

మరుక్షణమే కిచకిచ గాలిలో తేలుకుంటూ శివపురం చేరి, గొంతు సవరించుకుని పాడడం ప్రారంభించింది. అకాలంలో ఉరుము శబ్దం ఏమిటా అని బయటకు వచ్చి చూసిన గ్రామస్థులు, గాలిలో పల్టీలు కొడుతూ పాడుతూన్న పిశాచాన్ని చూసి, భయ భ్రాంతులై ఇళ్ళల్లోకి దూరి తలుపు మూసి గడియ పెట్టుకున్నారు.

ఆ రాత్రంతా కిచకిచ పాటలు పాడుతూ ఊరంతా చక్కర్లు కొట్టింది. తెలతెలవారుతూండగా అడవికి తిరిగి వచ్చి, ఒక చెట్టు మీదికి చేరి గాఢ నిద్రలోకి జారుకుంది. పొద్దు గూకి చీకటి పడుతూండగా, మెలకువ రావడంతో అది చెట్టు దిగి కిష్టయ్య వద్దకు వెళ్ళి, ''చాలా రోజుల తరవాత కంటినిండా నిద్రపట్టింది. నీరుణం ఉంచుకోను,'' అంటూ

మాయమై, మరు క్షణంలో మూటతో ప్రత్యక్ష మయింది.

మూట విప్పి చూసి కిష్టయ్య కళ్ళు చెది రాయి. మూటనిండా బంగారు నగలు, బంగారు కాసులు! వాటిని తీసుకుని పిశాచా నికి కృతజ్ఞతతో దణ్ణంపెట్టి కిష్టయ్య ఇంటికి బయలుదేరాడు.

పగలంతా బాగా నిద్రపట్టడంతో కిచకిచ ఆ రాత్రంతా ఆనందంగా గడిపింది. తెల్ల వారాక కూడా దానికి నిద్రపట్టింది. మరునాటి రాత్రి దానికి ఎందుకో పాడాలనిపించలేదు. పిశాచాలతో కలిసి ఉత్సాహంగా తిరిగింది. పగలంతా చెట్టు కొమ్మపై కునుకుతీసింది.

పిశాచం ఇచ్చిన ధనంతో ఇల్లు చేరిన కిష్టయ్యకు ఆ క్షణం నుంచి నిద్రకరువయింది. మనసులో ఒక విధమైన వ్యాకులం బయలు దేరింది. దానికి తోడు రెండు రాత్రులు వర సగా కిచకిచ రాకపోవడంతో దాన్ని వెతు క్కుంటూ, అడవికి వెళ్ళి, చెట్టు కొమ్మపై కునుకుపాట్లు పడుతూన్న దాన్ని లేపి, ''రెండు రాత్రులు పాడడానికి ఊరువైపు రాలేదేం మిత్రమా?'' అని అడిగాడు.

''రావలసిన అవసరం ఏర్పడలేదు. అయినా, నాకు నిద్రపట్టక పోవడానికి అసలు కారణం ఇప్పుడు తెలిసిపోయింది. నా చెట్టు తొర్రలో నేను అన్నాళ్ళు కాపలా కాస్తూ వచ్చిన ధనం-నేను ప్రాణాలతో ఉన్నప్పుడు బంగారు నగలని చెప్పి నకిలీ నగలమ్మి అమాయక ప్రజలను మోసం చేసి కూడబెట్టిన పాపిష్ఠి సొమ్ము. ప్రమాదవశాత్తు అకాల మరణం పాలై, పిశాచమైనప్పటికీ; ఆ ధనాన్ని వదల కుండా తెచ్చి, తొర్రలో దాచి కాపలా కాస్తూ వచ్చాను. ఆ పాపపు సొమ్ము నా వద్ద ఉన్నంత వరకు నాకు నిద్రపట్టలేదు. దాన్ని నీకిచ్చి వదిలించుకున్నాక, హాయిగా నిద్రపడుతు న్నది!'' అంటూ పెద్దగా ఆవులించి మళ్ళీ నిద్రకు ఉపక్రమించింది కిచకిచ.

తన అశాంతికి కారణం గ్రహించి, ఇంటికి తిరిగి వచ్చిన కిష్టయ్య, పిశాచం ఇచ్చిన ధనాన్ని దాన ధర్మాలు చేసేశాడు. ఆ తరవాత తనకున్న కొద్దిపాటి పొలంలో భార్యాపిల్లలతో కలిసి పగలంతా కాయకష్టం చేస్తూ, రాత్రుల్లో కంటినిండా నిద్రపోతూ శేషజీవితాన్ని ప్రశాం తంగా గడిపాడు.



## కిప్లింగ్ మ్యూజియం



ముంబాయిలోని ఒక భవనం ముఖద్వారం వద్ద, ''ఇక్కడ లాక్‌వుడ్ కిప్లింగ్ కుమారుడు రుడ్యార్డ్ కిప్లింగ్ 30-12-1865వ తేదీ జన్మించాడు.'' అనే ఇంగ్లీషు లోహఫలకం కనిపిస్తుంది. భవనంలో వంద సంవత్సరాల క్రితం సాహిత్యంలో నోబెల్ బహుమతిని అందుకున్న ఆ సుప్రసిద్ధ రచయిత విగ్రహం ఉన్నది. ఈ భవనాన్ని కిప్లింగ్ మ్యూజియంగా మార్చడానికి ప్రయత్నాలు ఆరంభమయ్యాయి. కిప్లింగ్ రచనలలో జంగిల్ బుక్ (అరణ్య పురాణం) చాలా ప్రసిద్ధిగాంచింది. ఆ నవలలో-అడవిలో వదలబడిన మౌగ్లీ అనే పసివాణ్ణి ఒక తోడేలు పెంచుతుంది. 140 సం.ల నాటి ఈ రాతి-కొయ్య భవనంలో లాక్‌వుడ్ కిప్లింగ్ (1837-1911) నివసించాడు. ఆయన సుప్రసిద్ధ చిత్రకారుడు; ఉపాధ్యాయుడు. 1857లో స్థాపించబడిన 'జెజె స్కూల్ ఆఫ్ ఆర్ట్'లో ఆయన ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. ఆయనే తన కోసం ఈ భవనాన్ని నిర్మించుకున్నాడు. ఉత్తరోత్తరా అది స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ డీన్ నివాసభవనంగా మారింది. రూడ్యార్డ్ కిప్లింగ్ పుస్తకాలకు చాలావరకు కిప్లింగ్ సీనియర్ చిత్రాలు గీశాడు.

## పసివాడి అద్భుత జ్ఞాపకశక్తి!

కాలిఫోర్నియా, సన్నీవేల్‌కు చెందిన మాధవకృష్ణన్ అనే మూడేళ్ళ పసివాడు అమెరికాలోని 50 రాష్ట్రాల రాజధానీ నగరాల పేర్లనూ; ఆసియా, ఆఫ్రికా, యూరపు దేశాల పేర్లనూ అవలీలగా చెప్పగలుగుతున్నాడు. కఠినమైన పదాల స్పెల్లింగులను సరిగా చెప్పడమే కాక అమెరికా రాష్ట్రాల సంక్షిప్తనామాలనూ, 'అమెరికన్ ప్లెడ్జ్ ఆఫ్ అలీజియెన్స్'ను కూడా అప్పగించగలుగుతున్నాడు.

## వేదశ్లోక పఠనంతో అమెరికాలోని ఒక రాష్ట్ర అసెంబ్లీ సమావేశం ఆరంభం



అమెరికాలోని నెవాడా రాష్ట్ర అసెంబ్లీ మార్చ్ 19వ తేదీ-ప్రపంచంలోకెల్లా అత్యంత ప్రాచీనమైనదని భావించబడే ఋగ్వేదంలోని ఒక శ్లోకపఠనంతో ప్రారంభమయింది. నాలుగు పాదాల ఈ శ్లోకం స్ఫూర్తినీ, ఆలోచననూ, ఆశావాదాన్నీ ప్రేరేపిస్తుంది. ఉత్తర నెవాడాలోని హిందూ ఆలయాల పబ్లిక్ అఫేర్స్ డైరెక్టర్ రాజన్ జేడ్ ఈ శ్లోకాన్ని పఠించాడు. అసెంబ్లీ 'డైలీ జర్నల్'లో కూడా ఇది పొందుపరచబడింది.

## కర్ణాటక జానపద కథ

# మొర ఆలకించిన దేవుడు!

మాధవుడు చాలా పేదవాడు. అతడికి సరైన ఉద్యోగం లేదు. సంపాదన లేదుగనక, అతడు పెళ్ళి కూడా చేసుకోలేదు; తనకంటూ కుటుంబం ఏర్పరచుకోలేదు. ఒంటరి బతుకు బతుకుతూ ఎవరు ఏపని చెప్పినా చేస్తూ, వాళ్ళిచ్చిన దాన్ని పుచ్చుకుని తృప్తిగా కాలం గడుపుతున్నాడు.

కట్టెలు చీల్చడం, నీళ్ళు తోడడం, బట్టలు తకడం, పశువుల్ని తోలుకుపోయి దాపులనున్న నదిలో స్నానం చేయించడం ఇలా క్షణం తీరిక లేకుండా ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూ ఉండేవాడు. పనులన్నీ ముగించుకున్నాక నదిలో స్నానం చేసి గుడికి వెళ్ళి దేవుడికి మొక్కుకుని ఇంటికి వెళ్ళేవాడు.

అలా ఒకనాడు అతడు గుడిలోని విగ్రహం ముందు కళ్ళుమూసుకుని చేతులు జోడించి నిలబడి దేవుణ్ణి ప్రార్థించాడు. కళ్ళు తెరవగానే అతడికి దేవుడు తన కేసి దీనంగా చూస్తున్నట్టు అనిపించింది. దేవుడు అలిసి పోయాడా? గర్భగృహం నిండా భక్తులువెలిగించిన అగరు వత్తుల పొగ కమ్ముకునివుంది. ఆ పొగ దేవుడి కళ్ళకు మంట కలిగిస్తున్నదా ఏం? భక్తులు అలంకరించిన పెద్ద పెద్ద పూల మాలలను మోయలేక దేవుడు అవస్థపడుతున్నాడా? ఇలా ఆలోచించిన మాధవుడు, ''స్వామీ, నువ్వు బాగా అలిసి పోయినట్టున్నావు. నాతో మా ఇంటికి రా. నీకు మంచి భోజనం వండి పెడతాను,'' అన్నాడు చేతులెత్తి మొక్కుతూ. కన్నార్పకుండా చూస్తున్న మాధవుడికి దేవుడు మందహాసం చేస్తున్నట్ట నిపించింది. దేవుడి పెదవులు మెల్లగా కదల సాగాయి.

''మాధవా, నువ్వు ముందు ఇంటికి వెళ్ళి, భోజనం వండి సిద్ధం చేసి నా దగ్గరికి రా,'' అన్నాడు దేవుడు.

మాధవుడు ఇటూ అటూ చూశాడు. తనతో పాటు అక్కడ ఇంకా కొందరు భక్తులు ఉన్నారు. అయితే, దేవుడు తనతో మాత్రమే మాట్లాడినట్టు మాధవుడు గ్రహించాడు. దేవుడి విగ్రహం ఇంకా మందహాసం చేస్తూ ఉన్నట్టు మాధవుడికి కనిపించింది.





మాధవుడు గుడినుంచి వెలుపలికి వచ్చి, గబగబా ఇంటికేసి నడవసాగాడు. ఇల్లు చేర గానే వంట చేయడం ప్రారంభించాడు. బియ్యం, పప్పు, కూరగాయలతో రుచికరమైన వంట పూర్తి కాగానే, దానిని భద్రంగా దాచి, ఇంటి తలుపు మూసుకుని గుడికి బయలుదేరాడు. నాలుగడుగులు వేశాడో లేదో, ఊతకర్ర సాయంతో నడవలేక నడుస్తూ ఒక ముసలి వాడు ఎదురుపడి, ''నాయనా, పొద్దుటి నుంచి ఆకలితో అలమటిస్తున్నాను. ఇంత తిండి ఉంటే పెట్టు. పుణ్యముంటుంది,'' అని దీనంగా అడిగాడు.

మాధవుడికి అతని మీద జాలి కలిగింది. ''నాతో రా,'' అంటూ వెనుదిరిగి అతన్ని ఇంటికి తీసుకు వెళ్ళాడు. ముసలివాడు కూర్చుని కొద్దిగా, అయితే ఎంతో ఆనందంగా తిన్నాడు. ''చాలా సంతోషం నాయనా. నీ కరుణ ఎన్న టికీ మరువను. దేవుడు నిన్ను ఎల్లవేళలా కాపాడగలడు,'' అంటూ ఊతకర్రను అందు కుని ముసలివాడు వెళ్ళిపోయాడు.

మాధవుడు ఇంటి తలుపు మూసుకుని మళ్ళీ గుడికి బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళేసరికి, దారి పక్కన ఒక ముసలిది ఆకలితో చాలా దీనంగా కనిపించింది. ఆమెకు ఇంత ఆహారం పెడితే సంతోషిస్తుంది కదా అని మాధ వుడు భావించాడు. ఆమెను ఇంటికి తీసుకు వెళ్ళి అన్నం పెట్టాడు. భోజనం చేసి చేతులు కడుక్కున్నాక, ఆమె కళ్ళు ప్రశాంతంగా, తృప్తిగా కనిపించాయి. విచారం మటుమాయమయింది. ''దేవుడు నిన్ను చల్లగా చూడగలడు నాయనా. ఈ రోజును నేనెన్నటికీ మరిచిపోను,'' అంటూ ముసలిది వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళాక, మాధవుడు ఇంటి తలుపు మూసుకుని మళ్ళీ గుడికేసి బయలుదేరాడు. అతడు వేగంగా అడుగులు వేయబోతూండగా, ఎవరో వెనకనుంచి తన బట్టను పట్టుకోవడం గమనించాడు. వెనుదిరిగి చూసిన మాధవుడికి చిరిగిన దుస్తులతో, ఆకలి చూపులతో చేతిని కడుపుకేసి చూపుతూ ఒక పసివాడు కనిపిం చాడు. వాడు తనను అన్నం కోసం అడుగుతు న్నట్టు మాధవుడు గ్రహించాడు. ఆ తరవాత క్షణం కూడా ఆలోచించకుండా పసివాడి చేయి పట్టుకుని ఇంటికి తీసుకువెళ్ళి కడుపు నిండా తిండి పెట్టాడు. ఆ కుర్రవాడు అన్నం తింటూ, తానొక అనాథననీ, బిచ్చమెత్తుకుని బతుకుతు న్నాననీ చెప్పాడు. మాధవుడు వాడిపై జాలిపడి, ''రేపు సాయంకాలం వచ్చావంటే ఇంత తిండి పెడతాను,'' అంటూ మూడోసారి తలుపు మూసు కుని గుడికేసి వేగంగా బయలుదేరాడు.

మాధవుడు గుడిలోకివెళ్ళి విగ్రహం ముందు చేతులు జోడించి, ''నన్ను క్షమించు స్వామీ. ఇంటి

నుంచి రావడానికి ఆలస్యమయింది,'' అన్నాడు.

''నువ్వు నాకు ఎప్పుడో భోజనం పెట్టావు కదా, మాధవా?'' అన్నాడు దేవుడు.

''ఎప్పుడు స్వామీ? నేను ఇప్పుడే కదా వస్తున్నాను,'' అన్నాడు మాధవుడు విస్మయంతో.

''ఒక వృద్ధుడికీ, వృద్ధురాలికీ, అనాథ బాలుడికీ అన్నం పెట్టావుకదా? అది నాకు పెట్టినట్టే. నాకు చాలా ఆనందంగా ఉన్నది,'' అన్నాడు దేవుడు.

''మరి, నువ్వు మా ఇంటికి వస్తానని మాట ఇచ్చావు కదా,'' అని మాధవుడు దేవుడికి గుర్తు చేశాడు.

''అలాగా! తప్పకుండా వస్తాను. ముందుగా నడువు. నీవెంటే వస్తాను,'' అన్నాడు దేవుడు.

ఇంటిని సమీపించిన మాధవుడు తలుపు తెరిచి వెనక్కు తిరిగి చూశాడు. దేవుడు దివ్యాద్భుత ప్రకాశంతో నిలబడి ఉన్నాడు. ''కూర్చో స్వామీ. నువ్వు మా ఇంటికి రావడం ఎంతో సంతోషంగా ఉన్నది. ఇదిగో ఈ పండు తిను,'' అంటూ ఒక పండును ఇచ్చి, పక్కనున్న విసనకర్రను తీసుకుని దేవుడికి మెల్లగా వీచసాగాడు మాధవుడు. దేవుడు పండు ఆరగించి లేచి నిలబడ్డాడు. మాధవుడు సాష్టాంగ నమస్కారం చేసి, లేచే సరికి దేవుడు అదృశ్యమయ్యాడు. గుడి వరకు వెళ్ళి దిగబెట్టి వద్దామనుకున్న మాధవుడికి కొద్దిగా ఆశాభంగమయినప్పటికీ, దేవుడు తన ఇంటికి వచ్చాడన్న ఆనందంతో పొంగిపోయాడు.

దేవుడు పేదవాడైన మాధవుడి ఇంటికి వచ్చిన విషయం ఆ నోటా ఈ నోటా పడి ఆ ఊరిలోని గొప్ప భూస్వామికి తెలిసింది. ఆలయ పునరుద్ధరణకూ, ఇతర కైంకర్యాలకూ భూస్వామి ఎంతో ధనం విరాళంగా ఇచ్చాడు. అయినా దేవుడెప్పుడూ అతడి ఇంటికి రాలేదు. అతడు వెంటనే ఆలయంలోకి వెళ్ళి చేతులు జోడించి, ''ప్రభూ! తమరెప్పుడు మా ఇంటికి విజయం చేస్తారు?'' అని అడిగాడు. అతని కంఠస్వరంలో వినయపూర్వక విన్నపం కన్నా, అధికారం ధ్వనించింది.

''నీ అభీష్టానుసారమే వస్తాను. మొదట వెళ్ళి భోజనం సిద్ధం చేసి నన్ను వచ్చి పిలువు,'' అన్న మాటలు విగ్రహం నుంచి వినిపించాయి. భూస్వామి చిన్నగా నవ్వి ఇంటికి తిరిగి వచ్చాడు. వంటవాళ్ళను పిలిచి షడ్రసోపేతమైన విందు భోజనం తయారు చేయమని ఆజ్ఞాపించాడు. వంట సిద్ధం కాగానే గుడికేసి బయలుదేరాడు.

దారిలో ఒక వృద్ధుడు ఎదురు పడి తన ఆకలి గురించి చెప్పాడు. ''నీలాంటి దరిద్రుడికి తిండి పెట్టడానికి నాకిప్పుడు తీరిక లేదు. దున్నలా ఉన్నావు, ఏదైనా పనీపాటూ చేసుకుని



బతకవచ్చుకదా?'' అంటూ కోపంగా భూస్వామి ముందుకు నడిచాడు.

నాలుగడుగులు వేసేలోగా, ''అయ్యా, పొద్దుటి నుంచి తిరుగుతున్నాను. గుప్పెడు మెతుకులు దొరకలేదు. ఆకలి దహించేస్తున్నది. అడుగు వేయలేక పోతున్నాను,'' అన్న వృద్ధురాలి దీనస్వరం వినిపించింది.

భూస్వామి పట్టరాని కోపంతో, ''ఈ ఊళ్ళో ఇంతమంది పనికిమాలిన బిచ్చగాళ్ళు ఉన్నారా? వెళ్ళు, వెళ్ళు. అవతల నాకు ముఖ్యమైనపని ఉంది,'' అంటూ కనీసం తిరిగైనా చూడకుండా హడావుడిగా ముందుకు అడుగువేశాడు.

ఇంకొకడు అడ్డుపడగలడని అతడు అనుకోలేదు. అంతలో మరొక బిచ్చగాడు ఎదురుపడి, కళ్ళు తిరిగి కిందపడిపోయేలావున్న తన ఆకలి బాధ గురించి దీనంగా ఏకరువు పెట్టాడు. భూస్వామి వాణ్ణి పక్కకు తోసేసి గబగబా ముందుకు నడిచాడు. అతడు రొప్పుతూ ఆలయంలోకి వెళ్ళి, విగ్రహం ముందు నిలబడి, ''ప్రభూ! మీకోసం షడ్రసోపేతమైన భోజనం సిద్ధం చేసి మిమ్మల్ని వెంటబెట్టుకు వెళ్ళడానికి వచ్చాను,'' అన్నాడు.

''నేనే స్వయంగా ఎప్పుడో నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. అయితే, నువ్వే నన్ను పట్టించుకోలేదు. మొదట నువ్వు కోపంతో నన్ను దరిద్రుడివి అన్నావు. ఆ తరవాత బిచ్చగత్తెవని తిట్టావు. మూడోసారి దారికి అడ్డమని పట్టి పక్కకు తోసి దిగ్భ్రాంతి కలిగించావు. వచ్చినప్పుడల్లా నాపట్ల కఠినంగా ప్రవర్తించావు. ఇప్పుడు నేను మాత్రం నీకోసం ఎందుకు సమయాన్ని వెచ్చించాలి?'' అన్నాడు దేవుడు.

ధనికుడైన భూస్వామి విగ్రహం కేసి అలాగే చూస్తూ నిలబడ్డాడు. కఠినమైన నల్లరాతిలో చెక్కిన ఆకారాన్ని మాత్రమే అతడిప్పుడు చూడగలిగాడు.



# చందమామ
# ఇండియా క్విజ్ - 4

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

ప్రాచీన కాలం నుంచి ఈనాటివరకు మన దేశం గొప్ప విజ్ఞాన శాస్త్ర వేత్తలకు ప్రసిద్ధిగాంచింది. అలాంటి శాస్త్రవేత్తలు కొందరిని గురించి ఈనెల క్విజ్‌లో తెలుసుకుందాం.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి), పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్-4 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. మే నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. జూలై 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. పక్కచిత్రంలో కనిపిస్తున్నది విక్రమాదిత్యుడి ఆస్థాన జ్యోతిష్కుడు. రాజు తన కుమారుణ్ణి 18వ యేట కోల్పో తాడని ఆయన జ్యోస్యం చెప్పాడు. ఆయన జ్యోస్యం నిజమయింది. యువరాజు ఎలా మరణించాడు? ఆ జ్యోతిష్కుడి పేరేమిటి?
2. స్థావర, జంగమ పదార్థాలన్నిటికీ భావోద్రేకాలు ఉంటాయని చాటిన మొట్టమొదటి శాస్త్రవేత్త ఎవరు?
3. ఒక వైద్యుడు శస్త్రచికిత్స చేయడానికి ముందు రోగులకు తాగడానికి మత్తు పానీయం ఇచ్చేవాడు. ఆయన్ను 'మత్తు మందుల పిత'గా పేర్కొంటారు? ఆయన పేరేమిటి? ఎప్పుడు నివసించాడు?
4. ఒక శాస్త్రవేత్త లండన్‌లో ఉపన్యాసమిచ్చాక, సముద్ర మార్గం గుండా మనదేశానికి తిరిగి వస్తున్నాడు. వినీల ఆకాశం, సముద్రం ఆయనకు అద్భుత ఆశ్చర్యాలు గలిగించాయి. దృష్టి సంబంధమైన వాటిని గురించి పరిశోధనలు మొదలు పెట్టాడు. ఆయనకు గొప్ప బహుమతి కూడా లభించింది. ఆయన పేరేమిటి? ఆయన అందుకున్న బహుమతి ఏది?



# గురువు సలహా

కనకపురంలోని భాస్కరుడు, శ్రీధరుడు బాల్యమిత్రులు. ఇద్దరూ నిత్యానందుడి గురకులంలోనే విద్యనభ్యసించారు. విద్యాభ్యాసం పూర్తయ్యాక భాస్కరుడు ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాడు. శ్రీధరుడు తండ్రి నడుపుతూన్న బట్టల వ్యాపారాన్ని చేపట్టి సమర్థతో నడుపుతున్నాడు. పెళ్ళిళ్ళు చేసుకుని పిల్లలు కలిగాక కూడా, ఇద్దరూ తరచూ కలుసుకుంటూ మంచీ చెడూ మాట్లాడుకునేవారు.

భాస్కరుడిది చాలా ముక్కుసూటి మనస్తత్వం. సమయపాలన అతనికి ప్రాణంతో సమానం. క్రమ శిక్షణ పాటించని విద్యార్థులను గోడకుర్చీ వేయమనీ, బడిచుట్టూ పరుగులు తీయమనీ కఠినంగా శిక్షించేవాడు. తను సత్ప్రవర్తనతో నడుచుకోవడమే కాకుండా ఇంటా బయటా అందరూ తనలాగే నడుచుకోవాలని ఆశించేవాడు. అలా నడుచుకోని వాళ్ళను మొహం మీదే విమర్శించేవాడు. అందువల్ల అతనికి రోజు రోజుకూ మిత్రుల కన్నా శత్రువులే ఎక్కువ కాసాగారు.

శ్రీధరుడు చాలా సున్నిత స్వభావుడు. ఎవరినీ పల్లెత్తు మాట అనేవాడు కాడు. ఎప్పుడూ నిమ్మకు నీరెత్తినట్టు గుంభనగా కనిపించేవాడు. అలాంటి వాడికి ఉన్నట్టుండి జబ్బు చేసిందని తెలిసి, భాస్కరుడు చూడడానికి వెళ్ళాడు. మిత్రుణ్ణి తీసుకుని, తాము చదువుకున్న గురుకులాశ్రమానికి ఆనుకుని వున్న నిత్యానందుడి వైద్యనిలయానికి వెళ్ళాడు. గురువు నిత్యానందుడు గురుకుల పాఠశాలతో పాటు ప్రకృతి వైద్య నిలయం కూడా నెలకొల్పి నడుపుతున్నాడు.

శ్రీధరుడికి స్వయంగా నాడీ పరీక్ష చేసి చూసిన నిత్యానందుడు, ''నీకు పెద్ద జబ్బేమీ లేదు. కావలసిందల్లా ప్రశాంతమైన మనస్సు మాత్రమే,'' అన్నాడు.

దాసరి మంజుభారతి (జెన్ కథ ఆధారంగా)

''మిన్ను విరిగి మీద పడ్డా చలించని మన స్తత్వం కదా శ్రీధరుడిది! అతనికి శాంతికి ఏమి కొరత?'' అన్నాడు భాస్కరుడు ఆశ్చర్యంగా.

ఆ మాటకు నిత్యానందుడు చిన్నగా నవ్వి, ''ఎదుటి వారికి అలా కనిపిస్తాడేమో గాని, లోలోపల ప్రతి చిన్న విషయానికీ బాధ పడుతూ ఉంటాడనుకుంటాను,'' అని, ''అవునా?'' అంటూ శ్రీధరుడికేసి చూశాడు.

శ్రీధరుడు మౌనంగా ఊరుకున్నాడు.

''నేనిచ్చే లేహ్యాన్ని రాత్రిపూట పడుకునే ముందు ఆవుపాలు అనుపానంతో ఒక మండలం పాటు సేవించు. పొద్దస్తమానం బట్టల దుకాణంలో కూర్చోకుండా వేరే ఏదైనా ఒక వ్యాపకం అలవాటు చేసుకో. వీలైతే, నీ పర్యవేక్షణలో ఒక ఉద్యానవనం నాటి, ఉదయం, సాయంకాలం కొంతసేపు అక్కడి చల్లగాలిలో తిరిగిరా. నీకు సంపూర్ణ ఆరోగ్యం సమకూరు తుంది,'' అంటూ నిత్యానందుడు లేహ్యం ఇచ్చాడు. సరేనని శ్రీధరుడు మిత్రుడితో కలిసి అక్కడి నుంచి బయలుదేరాడు.

మండలం రోజులు పూర్తయ్యాక శ్రీధరుడు గురువు వద్దకు వెళ్ళాడు. నాడీపరీక్ష చేస్తూ నిత్యానందుడు, ''ఇప్పుడు ఆరోగ్యం మెరుగు పడింది కదా?'' అని అడిగాడు.

''చాలా వరకు ఫరవాలేదు,'' అన్నాడు శ్రీధరుడు.

''ఈ లేహ్యాన్నే మరో మండలం పాటు వాడాలి. అది సరే, ఉద్యానవనం పని ఎంత వరకు వచ్చింది?'' అని అడిగాడు గురువు.

''ఫల వృక్షాలతో, పూల మొక్కలతో ఉన్న పెరటి తోటనే ఉద్యానవనంగా తీర్చిదిద్దాను గురువర్యా,'' అన్నాడు శ్రీధరుడు.





''చాలా సంతోషం. రోజూ చల్లగాలిలో పచార్లు చేస్తున్నావు కదా?'' అని అడిగాడు గురువు.

''క్రమం తప్పకుండా చేస్తున్నాను. వీలైనప్పుడు తమరు ఒకసారి విచ్చేసి, నా ఉద్యానవనాన్ని తిలకిస్తే బావుంటుంది,'' అన్నాడు శ్రీధరుడు వినయంగా.

''తప్పకుండా వస్తాను. ఈ రోజు అమావాస్య కదా? రాబోయే పౌర్ణమికి వచ్చి, నీ ఉద్యానవనాన్ని చూస్తాను,'' అన్నాడు గురువు చిన్నగా నవ్వుతూ.

గురువు వద్ద సెలవు తీసుకుని బయలుదేరిన శ్రీధరుడు, ఆయన ఉద్యానవనం చూడడానికి వస్తూన్న సంగతి భాస్కరుడికి చెప్పాడు.

పౌర్ణమినాటి ఉదయమే నిత్యానందుడు ఉద్యానవనం చూడడానికి వచ్చాడు. మిత్రులిద్దరూ గురువుకు స్వాగతం పలికి, సాదరంగా ఆయన్ను తీసుకు వెళ్ళి ఉద్యానవనాన్ని చూపారు.

పచ్చటి చెట్లతో, రంగురంగుల పూలతో అందంగా ఉన్న ఉద్యానవనాన్ని ఆనందంతో తిరిగి చూసిన నిత్యానందుడు, ''ఉద్యానవనం బావుంది. అయినా, పసిడిగాలి వీచడం లేదెందుకని?'' అని అడిగాడు శిష్యులను.

ఆ ప్రశ్న అర్థం కాక మిత్రులిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

''చెట్ల నుంచి రాలిన పండుటాకులను ఒక్కటి కూడా లేకుండా ఏరి పారేశారెందుకని? ఎండుటాకుల మీదుగా వీచే పసిడి గాలి తోటకు మరింత శోభను సమకూర్చడం మీరెప్పుడూ చూడలేదా?'' అని అడిగాడు గురువు ఆశ్చర్యంగా.

మిత్రులిద్దరూ ఎలాంటి సమాధానం చెప్పకుండా మౌనంగా ఉండిపోయారు. అప్పుడు గురువు మళ్ళీ, ''పచ్చటి చెట్లతో పాటు, రంగు రంగుల పువ్వులు, పండుటా కులు కూడా కలిగినదే ఉద్యానవనం. అవునా?'' అని అడిగాడు.

మిత్రులిద్దరూ, ''అవును,'' అన్నట్టు తలలు ఊపారు.

''ప్రపంచం కూడా అంతే. మంచీ, చెడూ రెండూ ఉంటాయి. విభిన్న మనస్తత్వాలు కలిగిన వారుంటారు. పుట్టిపెరిగిన పరిస రాలు, పెంపకం, చదువు సంధ్యలు మొదలైన వాటిని అనుసరించి వారి వారి ప్రవర్తన ఉంటుంది. నా శిష్యులైన మీరు మంచి వాళ్ళుగా బాధ్యతనెరిగి నడుచుకోవడం నాకెంతో గర్వంగా ఉంది,'' అంటూ గురువు భాస్క రుడి కేసి తిరిగి, ''నువ్వు ఆదర్శ భావాలు కలవాడివే. అయితే, ప్రతి ఒక్కరూ నిన్ను పోలి ఉండాలనుకోవడం, అలా లేనివారితో విరోధం పెంచుకోవడం వివేకం కాదు,'' అన్నాడు. ఆ తరవాత ఆయన శ్రీధరుడి కేసి చూస్తూ,

''చాలా సౌమ్యుడని పదిమందిలో పేరు తెచ్చుకుంటున్నావు. చాలా సంతోషం. అయితే, నచ్చని వారి పట్ల కలిగే అసంతృప్తినీ, ఆవేద ననూ లోలోపల అణుచుకుంటూ అశాంతితో అనారోగ్యాన్ని కొని తెచ్చుకోవడం భావ్యం కాదు కదా!'' అన్నాడు.

ఆ తరవాత శిష్యులిద్దరినీ ఆప్యాయంగా మెన్ను చరిచి, ''మీరు మంచివారుగా ఉంటూ, చుట్టూ ఉన్న వారిని మంచి మార్గంలో నడి పించడానికి ప్రయత్నించండి. అంతేగాని, అహర్నిశలూ ఎదుటివారిని గురించి ఆలో చిస్తూ, అనవసరంగా ఆవేశపడుతూ పండంటి జీవితాలను వృథా చేసుకోకండి. నా శిష్యులైన మీ ఇద్దరి మనస్తత్వాలలోనే ఎంత తేడా ఉందో ఒక్కసారి ఆలోచించి చూడండి,'' అని సలహా ఇచ్చి వెళ్ళాడు.

ఆ క్షణం నుంచి మిత్రులిద్దరూ గురువు సలహాను పాటించసాగారు. అతి త్వరలోనే శ్రీధరుడు ఆరోగ్యం పుంజుకున్నాడు. భాస్క రుడు అందరిచేతా మంచి స్నేహితుడని పించుకున్నాడు.



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (17)

# నిజమైన గౌరవం

పందొమ్మిదవ శతాబ్దంలో మనదేశంలో గొప్ప రాజకీయ నాయకులు, స్వాతంత్ర్యయోధులు, రచయితలు, శాస్త్రవేత్తలు, తత్వవేత్తలు, యోగులు జన్మించారు. అలాంటి సుప్రసిద్ధులలో సంఘ సంస్కరణ కోసం పాటుపడిన వారిలో మున్నెన్నదగిన మహనీయుడు పండిట్ ఈశ్వర చంద్ర విద్యాసాగర్ (1820-91).

అవిభాజ్య బెంగాల్ మెదినిపూర్ జిల్లాలోని ఒక పేద బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన ఈశ్వరచంద్ర అనేక కష్టాలను ఎదుర్కొంటూ విద్యనభ్యసించాడు. కొల్‌కత ప్రభుత్వ సంస్కృత కళాశాలలో ఉపన్యాసకుడిగా చేరిన ఆయన, ఆ తరవాత ఆ కళాశాల ప్రిన్సిపాల్ పదవిని చేపట్టాడు. బెంగాలీ వచన రచనకు నూతన ఒరవడిని ప్రవేశపెట్టిన మార్గదర్శకుడిగా గుర్తింపు పొందాడు. ఆంగ్ల భాషనూ, పాశ్చాత్య తత్వశాస్త్రాన్నీ భారతీయులు చదవాలని ఉద్బోధించినప్పటికీ, ఆయన పాశ్చాత్య జీవనశైలిని అనుకరించకపోవడం విశేషం. నడుముకు పంచకట్టుకుని, పైన నూలు శాలువా కప్పుకుని నిరాడంబరంగా కనిపించేవాడు.

ఆయనసంస్కృతంలోనూ, ప్రాచీనసాహిత్యంలోనూ అసమాన పండితుడు. అందుకే ఆయనకు విద్యాసాగరుడనే బిరుదు లభించింది. బ్రాహ్మణుడిగా పుట్టి, ఆచార సంప్రదాయాలనూ, పూజాపునస్కారాలనూ క్రమం తప్పకుండా పాటించినప్పటికీ - పవిత్ర సంప్రదాయాల ముసుగులో వస్తున్న మూఢాచారాలనూ, మూఢ నమ్మకాలనూ తీవ్రంగా వ్యతిరేకించాడు. ఆ కాలంలో ఆడపిల్లలకు మరీ చిన్నప్పుడే పెళ్ళిళ్ళు జరిగేవి. మరీ కొందరయితే పెళ్ళిళ్ళయి భర్తల వద్దకు వెళ్ళక ముందే వైధవ్యం పాలయ్యేవారు. అలాంటి వితంతువులు ఒంటి పూట భోజనం మాత్రమే చేయాలి. తెల్లటి బట్టలే ధరించాలి, నగలేవీ పెట్టుకోకూడదు. శుభకార్యాలకు హాజరు కాకూడదు.

ఈ దురాచారానికి మన పురాతన గ్రంథాలలో ఎలాంటి ఆధారాలూ లేవని విద్యాసాగర్

## చందమామ ఇండియా క్విజ్-2 (మార్చ్ 2007) సమాధానాలు

1. కుజులా ఖడ్‌ఫైసెస్.
2. శ్రావణ బెళగొళ (కర్ణాటక).
3. రాష్ట్రకూట వంశానికి చెందిన కృష్ణ I; 9వ శతాబ్దంలో.
4. హంపి (కర్ణాటక).
5. 3వ పానిపట్టు యుద్ధంలో (1716).
6. షేర్షా సూరి.
7. రజీయా సుల్తానా.
8. గ్రీకుపాలకుడు మెనాండర్.
9. చండేలాలు.
10. కనూజ్.
11. లార్డ్ కార్న్‌వాలీస్.
12. సికందరా (ఆగ్రా సమీపంలో).

ప్రచారం చేశాడు. నిరపరాధలైన బాల వితం తువులను వేధించే హక్కు సమాజానికి లేదని వాదించాడు. ఛాందస భావాలుగల పూర్వాచార పరాయణులు వ్యతిరేకించినప్పటికీ, విద్యాసాగర్ వితంతు పునర్వివాహాలను సమర్థించి ప్రోత్సహిం చాడు. ఆఖరికి హిందూ వితంతు పునర్వివా హాన్ని ప్రభుత్వం చట్టబద్ధం చేసింది. విద్యాసాగర్ పోరాటానికి విజయం లభించింది.

ఒకనాడు పాశ్చాత్య పద్ధతిలో సూటూ, కోటూ ధరించిన ఒక యువకుడు విద్యాసాగర్ ఇంటి సమీపంలో వున్న రైల్వేస్టేషన్లో దిగాడు. అతడు తీసుకెళ్ళడానికి చేతిలో ఒక చిన్న సూట్‌కేస్ మాత్రమే ఉన్నది. ప్లాట్ ఫారంలో అడుగు పెట్టగానే, ''కూలీ, కూలీ!'' అని అరవ సాగాడు. అయితే, ఆ సమయానికి కూలీ లెవ్వరూ కనిపించలేదు. పల్లెటూరి మనిషిలా వున్న ఒక పెద్దాయన ఆ యువకుడి వద్దకు నడిచి వెళ్ళి, సూట్‌కేస్‌ను ఎత్తుకున్నాడు.

''నీకు పండిట్ విద్యాసాగర్ ఇల్లు తెలుసా?'' అని ఆ యువకుడు ఆయన్ను అడిగాడు.

''తెలుసు బాబూ,'' అన్నాడు ఆయన.

''మంచిది. నువ్వు నా లగేజ్‌ని అక్కడివరకు మోసుకురావాలి. ఎంత అడుగుతావేమిటి?'' అని కొద్ది క్షణాలు ఆగి, ''నేను అక్కడ ఎంతో సేపు ఉండను. వెంటనే స్టేషన్‌కు తిరిగివచ్చి, తరవాతి రైలు పట్టుకుని మరోచోటికి వెళ్ళాలి. నువ్వు గనక మరీ ఎక్కువ అడగలేదంటే, వచ్చేప్పుడు కూడా మళ్ళీ దీన్ని మోసుకురావడా నికి నిన్నే ఉపయోగించుకుంటాను. ఏమం టావ్?'' అన్నాడు ఆ యువకుడు.

''అలాగే బాబూ. ఆ సంగతి తరవాత చూసు కుందాం. దయచేసి ఇప్పుడు నాతో రండి,'' అంటూ ఆయన ముందుకు నడిచాడు.

కొన్ని నిమిషాలలో ఇద్దరూ విద్యాసాగర్ ఇల్లు చేరారు. తన సూట్‌కేస్‌ను మోసుకొచ్చిన పెద్దమనిషే, సుప్రసిద్ధ పండిట్ ఈశ్వరచంద్ర విద్యాసాగర్ అని తెలియడంతో ఆ యువ కుడు దిగ్భ్రాంతి చెందాడు. సిగ్గుతో తలెత్తి చూడలేకపోయాడు. అప్పుడు విద్యాసాగర్– మనం చేసుకోలేని స్థితిలో ఉన్నప్పుడు తప్ప, మన చిన్న చిన్న పనులు మనమే చేసుకోవ డంలో తప్పు లేదు. లేనిపోని ప్రతిష్ఠలకు పోవడం వల్ల ఎలాంటి ప్రయోజనమూ ఒరగదు. మన పనులు మనం చేసుకోవడంలో గౌరవం తప్ప ఎలాంటి చిన్నతనమూ లేదని చెప్పాడు.

ఆ యువకుడు జీవితంలో మరిచి పోలేని గుణపాఠం నేర్చుకున్నాడు. –(ఎం.డి)





# జడుపు జ్వరం

అంగలకుదురు గ్రామంలో వరహాలయ్య అనే వ్యాపారి ఉండేవాడు. చిల్లరకొట్టు మీద కొన్నేళ్ళకు బాగా డబ్బు గడించాడు. మనిషి మాత్రం పరమ పిసినారి.

వరహాలయ్యకు ఉన్నట్టుండి జ్వరం పట్టుకున్నది. మాట కూడా పడిపోయింది. గ్రామ వైద్యుడు వచ్చి ఆయన నాడి చూశాడు. అన్ని రకాల పరీక్షలు చేశాడు. ఆదుర్దా పడుతూన్న ఆయన కుటుంబ సభ్యులతో, ''శరీరంలో ఏ దోషమూ లేదు. చూడబోతే ఇది జడుపు జ్వరంలాగా ఉంది,'' అని తేల్చి చెప్పాడు.

అతని మాట మీద నమ్మకంతో వరహాలయ్య కొడుకు ఆంజనేయులు, భూత వైద్యుణ్ణి పిలిపించాడు. వాడు మంత్రాలు చదివాడు; తాయెత్తులు కట్టాడు. అయితే ఎలాంటి ఫలితమూ కనిపించలేదు. ఆంజనేయులు వైద్యుడి దగ్గరికి వెళ్ళి, ''మీ మాట ప్రకారం జడుపు జ్వరానికి వైద్యం చేయించాను. కాని ఫలితం కనిపించలేదు,'' అని చెప్పాడు.

అప్పుడు వైద్యుడు, ''చూడు నాయనా, జడుపుజ్వరం అంటే ఏ దెయ్యాన్నో, భూతాన్నో చూసి జడిస్తేనే వచ్చేది కాదు. జడిపించే ఏ విషయమైనా విని ఉన్నా రావచ్చు. మనసుకు భయం కలిగించే అటువంటి సంఘటన ఏదైనా జరిగిందేమో విచారించి, దానికి అనుగుణంగా నచ్చజెప్పి జడుపు పోగొట్టండి. లేకుంటే మనిషి రోజు రోజుకూ మరింత క్షీణించి మనకు దక్కడు,'' అని చెప్పి హెచ్చరించాడు.

ఆ మాట వినగానే ఆంజనేయులుకు ఒక సంఘటన గుర్తుకు వచ్చింది. తండ్రి పిసినారి తనానికి విసిగిపోయిన ఆంజనేయులు రెండు రోజుల క్రితం, ''నా ఆస్తి నాకు పంచెయ్. నా బతుకు నేను బతుకుతాను,'' అని వాదులాటకు దిగాడు. ఆ మాటకు భయపడి, తండ్రి

ఎన్. ఎస్. రావు

జడుపు జ్వరం తెచ్చుకున్నాడేమోనని ఆంజనేయులు బాధపడ్డాడు.

ఇల్లు చేరిన ఆంజనేయులు వైద్యుడు చెప్పిన విషయం తల్లికీ, భార్యకూ వివరించి, తండ్రి మంచం దగ్గరికి వెళ్ళి, ''నాన్నా, నన్ను క్షమించు. నేనెక్కడికీ వెళ్ళను. నీతోనే ఉంటాను,'' అని అన్నాడు.

అయినా వరహాలయ్య జడుపుజ్వరం తగ్గలేదు.

వరహాలయ్య మంచానపడడంతో, ఆంజనేయులు చిల్లరకొట్టు చూసుకోసాగాడు. అరా తీసిన ఖాతా దారులకు తండ్రి జడుపుజ్వరం గురించి చెప్పాడు.

రంగయ్య అనే ఖాతాదారు వరహాలయ్యకు అయిదు వందలు బాకీ పడ్డాడు. అప్పు తక్షణం తీర్చమన్న వరహాలయ్యను కొంత గడువు ఇవ్వమని రంగయ్య ప్రాథేయపడ్డాడు. వరహాలయ్య ససేమిరా అన్నాడు. ఆగ్రహం చెందిన రంగయ్య, ''నీ బాకీ దమ్మిడీ తీర్చను. ఏం చేసుకుంటావో చేసుకో,'' అన్నాడు.

దమ్మిడీకీ, అణాకూ కక్కుర్తి పడే వరహాలయ్య అయిదు వందల బాకీ ఎగ్గొడతాననే సరికి జడుసుకుని జ్వరం తెచ్చుకుని ఉంటాడని రంగయ్య అర్థం చేసుకున్నాడు. నిజానికి రంగయ్య మంచిమనిషి. ఏదో కోపంలో అలా అన్నాడేగాని, బాకీ ఎగ్గొట్టే ఉద్దేశం అతనికి లేదు. రంగయ్య వెంటనే వరహాలయ్య దగ్గరికి వెళ్ళి, ''భయపడకు. నీ బాకీ వడ్డీతో సహా తీరుస్తాను,'' అని హామీ ఇచ్చాడు.



అయినా వరహాలయ్య జడుపుజ్వరం తగ్గలేదు.

వరహాలయ్య జడుపుజ్వరం గురించి ఊరంతా తెలిసిపోయింది. అందరూ వచ్చి, ఆయనకు ధైర్యం చెప్పి వెళ్ళారు. అయినా ఫలితం కనిపించలేదు.

పొరుగూరిలో ఉన్న వరహాలయ్య వియ్యంకుడికి విషయం తెలిసింది. అతడు వచ్చి, ''కట్నం డబ్బుకు తొందర చేశాను. నిదానంగానే ఇద్దువులే! ఇవ్వక పోయినా ఫరవాలేదు. బంగారం లాంటి నీ కూతుర్ని మేం బాగానే చూసుకుంటున్నాం. దిగులు పడకు,'' అని ధైర్యం చెప్పి వెళ్ళాడు.

అయినా, వరహాలయ్య జడుపు జ్వరం తగ్గలేదు.

జరుగుతూన్న తంతు చూస్తూన్న వరహాలయ్య భార్య గజలక్ష్మికి ఉన్నట్టుండి ఒక విషయం గుర్తుకు వచ్చింది. ఆమె భర్త దగ్గరకు వెళ్ళి చెవిలో ఏదో గొణిగింది. తక్షణం వరహాలయ్య లేచి కూర్చున్నాడు.

ఆ దృశ్యం చూసిన కొడుకు, కోడలు, ఆశ్చర్యపడుతూ గజలక్ష్మిని, ''ఏం చెప్పావు? లేచి కూర్చున్నాడు!'' అని అడిగారు.

గజలక్ష్మి కొద్దిగా సిగ్గు పడుతూ, ''పెళ్ళయిన దగ్గరి నుంచి బంగారు వడ్డాణం చేయించమని పోరుపెడుతున్నాను. వినిపించుకోలేదు. వారం క్రితం, వడ్డాణం చేయించకపోతే బావిలో దూకి చస్తానని బెదిరించాను. అందుకే జడుపుజ్వరం తెచ్చుకున్నట్టున్నాడు. మతిమరుపు వల్ల ఆ విషయం నాకు ఆలస్యంగా గుర్తుకు వచ్చింది. వడ్డాణం చేయించనక్కరలేదులే అన్నాను. అంతే, వెంటనే లేచి కూర్చున్నాడు,'' అంటూ అసలు సంగతి బయట పెట్టింది.

హఠాత్తుగా తను మంచం పడితే భార్యాపిల్లలు చెందిన ఆందోళన, తను కోలుకోవడానికి వాళ్ళు కనబరచిన శ్రద్ధ వరహాలయ్య మనసులో కదలాడాయి. ఊరివారి ప్రవర్తన పట్లకూడా ఆయనకెంతో కృతజ్ఞత కలిగింది. ఆయన భార్యకేసి చేయి చూపుతూ, ''అంత పెద్ద రూపానికి వడ్డాణం చేయించాలంటే ఎంత బంగారం కావాలో అన్న భయంతో జడుపుజ్వరం వాతబడ్డాను కాని, నా మీద ప్రాణాలే పెట్టుకున్న భార్యకు ఎంత ఖర్చు పెడితే మాత్రం ఏం? ఆమె కోరిన వడ్డాణం చేయిస్తాను,'' అన్నాడు.

ఆయనకు మాట కూడా రావడంతో అక్కడున్న వాళ్ళందరూ సంతోషించారు.

గజలక్ష్మి భర్త చేయి పట్టుకుంటూ, ''నీ ఆరోగ్యం బాగుపడింది. అదే చాలు. అయినా, నీ పిసినారితనంతో విసిగిపోయి ఆరోజు అలా అన్నానే తప్ప, నాకు వడ్డాణం మీద మోజు ఎప్పుడో పోయింది. ఆ చేయించేదేదో మన కోడలుపిల్లకు చేయించు. చూడముచ్చటగా ఉంటుంది,'' అన్నది ఆప్యాయంగా.

ఆ మాటకు వరహాలయ్యతో పాటు అందరూ ఎంతో సంతోషించారు.





# మేక నవ్వింది!

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్త్వుడు ఒక కొండ మీద గొప్ప దేవదారువృక్షంగా పుట్టి, ఆ పరిసరాల్లో నివసించే మనుషుల ప్రవర్తనను గమనిస్తూం డేవాడు. ఆ కొండ దిగువున పండితుడొకా యన గురుకులం స్థాపించి, శిష్యులకు విద్యా బోధ చేసేవాడు.

ఒకసారి ఆ పండితుడు కూడనిపని ఏదో చేసి, ఆ పాపపరిహారానికి ఒక వ్రతం చేయ సంకల్పించాడు. ఆ వ్రతం ఫలించాలంటే, విధిగా ఒకమేకను బలి ఇవ్వవలసి వుంటుంది.

ఆయన ఒక ధనవంతుణ్ణి మేక కోసం యాచించాడు. అతడు తన మందలో వున్న మేకల్లో నుంచి వయసులో బలంగా వున్న దాన్ని పండితుడికి దానం చేశాడు. పండితుడు తన శిష్యుల్లో ఇద్దరిని పిలిచి, దాన్ని నదిలో శుభ్రంగా స్నానం చేయించి, మెడలో ఒక పూలదండ వేసి, తిరిగి తన వద్దకు తీసుకు రమ్మన్నాడు.

శిష్యులు గురువు ఆజ్ఞ ప్రకారం మేకను నది దగ్గిరకు తీసుకుపోయారు. ఆ సమ యంలో ఆకాశమంతా మేఘాలతో కప్పబడి వున్నది. శిష్యుల్లో ఒకడు దాన్ని నదిలో దింపి శరీరమంతా కడిగాడు. ఆ పని పూర్తయ్యేలోపల రెండవవాడు తీరంలో వున్న చెట్ల నుంచి రకరకాల పువ్వులు కోసి దండ తయారు చేశాడు.

శిష్యులిద్దరూ పూలదండను మేకమెడలో వేసేందుకు బయలుదేరుతున్నంతలో, అది బిగ్గరగా నవ్వింది. మొదట్లో వాళ్ళు, ఆ నవ్వింది మేక కాదనుకున్నారు. కాని, చుట్టు పక్కల మరొక మానవప్రాణి లేకపోవడంతో నవ్వినది మేక అని గ్రహించి, భయకంపి తులైపోయారు.



వాళ్ళు ఒకరి ముఖాలొకరు చూసుకుని, జంటగా పారిపోయేందుకు కూడబలుక్కుం టున్నంతలో, మేక నవ్వడం మాని, కళ్ళనీళ్ళు పెట్టుకున్నది. ఇది చూసి ధైర్యం తెచ్చుకున్న శిష్యులు దాన్ని తమ గురువు వద్దకు తీసుకు పోయారు.

వాళ్ళు గురువుతో రహస్యంగా, ''ఈ మేక నేదో భూతం ఆవహించినట్టున్నది. నది దగ్గిర ఇది మనిషిలా నవ్వింది; ఏడ్చింది. ఇలాంటిది బలిపశువుగా పనికి వస్తుందా?'' అన్నారు.

గురువు ఏదో అనబోయేంతలో మేక, ''నన్ను బలిపశువుగా ఉపయోగించుకోండి. ఎందుకు సంశయిస్తారు!'' అన్నది.

ఆ మాటలు వింటూనే శిష్యులతోపాటు గురువు కూడా భయం కొద్దీ వణుకుతున్నం తలో మేక, ''అలా భయపడకండి. మీకె లాంటి ప్రాణహానీ కలిగించను,'' అన్నది.

పండితుడు భయం నుంచి కాస్త తేరు కుని, ''మేక మనిషిలా మాట్లాడడం ఎంతటి మహాశ్చర్యం!'' అన్నాడు.

''ఇందులో ఆశ్చర్యపడవలసింది రవంత కూడా లేదు. నేనూ ఒకప్పుడు నీలాంటి మని షినే కాక బ్రాహ్మణ్ణీ, పండితుణ్ణీ కూడా!'' అన్నది మేక.

''అలాగా! అయితే, ఇంత నీచజన్మ నీకెం దుక్కలిగింది?'' అని అడిగాడు పండితుడు.

ఆ ప్రశ్నకు మేక దీనంగా ముఖం పెట్టి, ''నేను చాలా పాపకర్మలు చేశాను. ఒకానొక వ్రతంచేసి వాటినుంచి బయటపడవచ్చునన్న భ్రమతో, నేనూ ఒక మేకను బలి ఇచ్చాను. అయినా, విధిని మోసగించలేకపోయాను. ఆ తర్వాత ఐదువందలసార్లు మేకగా జన్మ ఎత్తడం జరిగింది!'' అన్నది.

పండితుడు అమితాశ్చర్యంతో, ''ఐదు వందలసార్లు మేకజన్మా!'' అన్నాడు.

''అవును. ఇందులో నాలుగువందల తొంభైతొమ్మిదిసార్లు ఎవరో ఒకరు నన్ను బలిపశువుగా వాడుకున్నారు. ఇవాళ నా తల ఐదు వందలసారి తెగబోతున్నది. దీనితో నాకు పాపవిముక్తి కలుగుతుంది. నదిలో స్నానం చేశాక, హఠాత్తుగా నాకు పూర్వజన్మ జ్ఞానం కలిగింది. అందుకే నవ్వాను,'' అన్నది మేక.

''అది బాగానే వుంది, మరి ఎందుకు ఏడ్చావు?'' అని పండితుడు అడిగాడు.

''నిజం చెబుతున్నాను. ఐదు వందల జన్మల ముందు, నేనేం చేసి పాపం మూట కట్టుకున్నానో, అలాంటి పనే నువ్వు చేయ బోతున్నావని గ్రహించాను. కనుక, నువ్వూ నాలాగే మేక జన్మలు ఎత్తి బాధల పాలవు తావు. నీ బుద్ధిహీనతకూ, ముందు ముందు నువ్వు అనుభవించే కష్టాలూ తలుచుకుని, నాకు కన్నీరాగింది కాదు,'' అన్నది మేక.

పండితుడు ఆలోచనలో పడ్డాడు. ఆయన శిష్యులు కొంచెం దూరంగా నిలబడి, మేక చెప్పినదంతా విని ఆశ్చర్యం చెందారు. మేకను బలి ఇవ్వడం ద్వారా, రాబోయే జన్మల్లో గురువు గారికి పట్టనున్న దుర్గతి తలుచుకుంటే, వాళ్ళకు ఆగకుండా కళ్ళవెంట నీరు కార సాగింది. పండితుడు తన శిష్యుల కేసీ, మేక కేసీ ఒకసారి సాలోచనగా చూశాడు. ఏవో మంత్రాలు చదివి, ఒక మేకను బలి ఇచ్చినంత మాత్రాన, తాను చేసిన పాపాలు తుడిచి పెట్టుకు పోతాయనుకోవడం అజ్ఞానం అన్న అభిప్రాయం ఆయనకు కలిగింది. అంతే కాక, ఇప్పుడు తానొక అల్పజీవిని చంపడం ద్వారా, మరింత పాపాన్ని మూటకట్టుకోవడం జరుగుతుందని గ్రహించాడు.

ఆయన మేకతో, ''భయపడకు! నేను, నిన్ను బలియివ్వను,'' అన్నాడు.

''నాకు చావంటే భయంలేదు. ఎంత త్వరగా చావు వస్తుందా అని ఆత్రంగా ఎదురు చూస్తున్నాను,'' అన్నది మేక.



"అదంతా నీ ఇష్టం. నేను మాత్రం చంపను! నువ్వెంత బ్రతిమాలినా, నా నిర్ణయం మాత్రం మార్చుకోను," అన్నాడు పండితుడు పట్టు దలగా.

"నాకు ఇవ్వాళ మృత్యువు రాసి పెట్టి వున్నది. అది నీ చేతి మీదుగా జరక్కపోతే, మరొకరు చేస్తారు!" అన్నది మేక.

పండితుడు ఒక్కక్షణం ఆలోచించి, "అలా జరగకూడదు. నీ కెవ్వరినుంచీ హాని కలగ కుండా చూసే బాధ్యత నాది," అన్నాడు.

ఆయన తన శిష్యులకు మేకను వదిలి పెట్టవలసిందిగా చెప్పాడు. మేక అక్కడి నుంచి బయలుదేరి, దాపులనున్న ఒకపండ్ల తోటలో ప్రవేశించి కొంతసేపు అటూ ఇటూ తిరిగింది. తరవాత నదీతీరానికి బయలు దేరింది. పండితుడూ, ఆయన శిష్యులూ దానికి కొంచెం దూరంగా నడవసాగారు.

రెండు, మూడు గంటలకాలం మేక ఆ విధంగా తనకిష్టమైన ప్రదేశాలన్నీ తిరిగి కొండ కేసి బయలుదేరింది. అది కొండపైకి ఎక్కు తుండగా పండితుడూ, ఆయన శిష్యులూ దిగువున వుండి దాన్ని గమనించసాగారు.

ఆ సరికి కొండపైన ఆకాశంలో మేఘాలు మరింతగా గుమిగూడాయి. మేక ఒక్కొక్క కొండరాయినే ఎక్కుతూ దిగుతూ శిఖర ప్రాంతాన్ని చేరింది. పండితుడూ, ఆయన శిష్యులూ చూస్తూండగా ఆకాశం పెద్దగా ఒకసారి ఉరిమింది. ఆ వెంటనే కళ్ళను మిరుమిట్లు కొల్పుతూ పిడుగొకటి వచ్చి మేక మీద పడింది.

పండితుడూ, ఆయన శిష్యులూ ఈ జరిగింది చూసి, ఒకసారి నిట్టూర్చి, వెనుదిరిగి గురుకులానికి బయలుదేరారు.

కొండ మీద దేవదారువృక్షంగా వున్న బుద్ధుడు వాళ్ళను చూసి చాలా సంతృప్తి చెందాడు. తాము చేసిన పాపకృత్యాల నుంచి విముక్తి పొందేందుకు వ్రతాలూ, యజ్ఞాల్లాంటివి చేసి బలులు ఇవ్వడం వృధా అన్న జ్ఞానం మనుషుల్లో ఏ కొద్దిమందికైనా కలగడం, ఆయనకు సంతోషకారణం అయింది.






# రామాయణం

ముందు రాముడూ, వెనక సీతా, సీత వెనకగా అస్త్రాలు చేపట్టి లక్ష్మణుడూ నడుస్తూ మును లను వెంటబెట్టుకుని అనేక పర్వతాలూ, నదులూ, సరస్సులూ, కొలనులూ, పక్షుల సమూహాలూ, ఏనుగుల మందలూ, ఎనుబో తుల మందలూ, అడవి పందుల మందలూ చూశారు.

సూర్యాస్తమయ సమయానికి వారు ఒక అందమైన సరస్సు చేరుకున్నారు. సరస్సు అడుగు నుంచి చక్కని గీతవాద్య ధ్వనులు రావటం చూసి రామ లక్ష్మణులు ఆనందాశ్చ ర్యాలు పొంది, ధర్మభృత్తనే మునిని, "ఏమిటీ వింత? రహస్యం కాని పక్షంలో చెప్పండి, విని ఆనందిస్తాము," అని అడిగారు.

వారికి ధర్మభృత్తు ఆ సరస్సు పుట్టు పూర్వోత్తరాలు తెలిపాడు: ఆ సరస్సు పేరు పంచాప్సరం. దానిని మాండకర్ణి అనే మహా ముని తన తపశ్శక్తి చేత నిర్మించాడు. ఆ మహాముని వాయుభక్షణ చేస్తూ పదివేల సంవత్సరాలు అతి దారుణమైన తపస్సు చేసే సరికి, అగ్ని మొదలుగాగల దేవతలు భయ పడి, ఆ ముని తమలో ఎవరిస్థానమో కాజేస్తా డని రూఢి చేసుకుని, తపోభంగం చెయ్యటం కోసం మెరుపుతీగల్లాంటి అయిదుగురు అప్స రసలను ఏరి మాండకర్ణి వద్దకు పంపారు. వారి ఎత్తు పారింది. మాండకర్ణి వారి వ్యామో హంలో పడి, తన తపశ్శక్తి ధారపోసి ఈ సరస్సు సృష్టించి, తాను యౌవనదేహం ధరించి, నీటి అడుగున అప్సరసల నిమిత్తం అదృశ్య హర్మ్యాలు నిర్మించి, వారిని భార్యలుగా చేసుకుని నృత్యగాన వినోదాలతో కాలక్షేపం చేస్తున్నాడు.



ధర్మభృత్తు చెప్పిన ఈ కథ వింటూ సీతా రామ లక్ష్మణులు ఆశ్రమ సమూహాలను చేరుకున్నారు. ఆశ్రమవాసులు రాముడికి గొప్పగా ఆతిథ్యం ఇచ్చారు. రాముడు తన భార్యతోనూ, తమ్ముడితోనూ ఒక్కొక్క ఆశ్రమంలోనూ తన ఇష్టానుసారం ఒక సంవత్సరమో, ఎనిమిది మాసాలో, ఆరు మాసాలో, మూడు మాసాలో ఉంటూ సుఖంగా పది సంవత్సరాలు గడిపాడు.

పది సంవత్సరాల అనంతరం రాముడు సీతా లక్ష్మణులతో తిరిగి సుతీక్ష్ణ మహాముని ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ ఉంటూ అతను ఒకనాడు మహామునితో, ''ఈ మహారణ్యంలో ఎక్కడో అగస్త్యుల వారు ఉంటున్నారని వారూ వారూ అనగా విన్నాను. కాని స్పష్టంగా వారి ఆశ్రమం ఎక్కడ ఉన్నదీ చెప్పినవారు లేరు. మీరు తెలిపినట్టయితే మేము ముగ్గురమూ వెళ్ళి వారి దర్శనం చేసుకుంటాము. ఆయనకు శుశ్రూష చేయాలని నాకు చాలా కుతూహలంగా ఉన్నది,'' అన్నాడు.

ఈ మాట వినగానే సుతీక్ష్ణుడు, ''నేను కూడా నీకు అదే సలహా ఇవ్వాలనుకుంటున్నాను. ఇంతలో నీవే అడిగావు. ఇక్కడికి దక్షిణంగా నాలుగామడలు పోతే అగస్త్యుడి తమ్ముడి ఆశ్రమం వస్తుంది. అక్కడికింకా ఒక ఆమడ దూరంలో అగస్త్యుడి ఆశ్రమం ఉన్నది. అవి చాలా అందమైన ఆశ్రమాలు. అక్కడ మీ ముగ్గురికి చాలా ఆనందంగా ఉంటుంది. వెళ్ళాలని ఉంటే వెంటనే బయలుదేరండి,'' అన్నాడు.

రాముడాయనకు నమస్కారం చేసి సీతా లక్ష్మణులతో బయలుదేరి అగస్త్య మహాముని తమ్ముడి ఆశ్రమానికి చేరాడు. ఆ సమయంలోనే రాముడు లక్ష్మణుడికి అగస్త్య మహిమ చెబుతూ వాతాపి ఇల్వలుల వృత్తాంతం చెప్పాడు:

ఇల్వలుడూ, వాతాపీ అని ఇద్దరు రాక్షసులుండేవారు. వారు ఎందరో బ్రాహ్మణులను మోసగించి చంపేశారు. ఇల్వలుడు బ్రాహ్మణ వేషం ధరించి, సంస్కృత భాషలో మాట్లాడుతూ బ్రాహ్మణుల వద్దకు వెళ్ళి, ''అయ్యా, ఇవాళ మా ఇంట శ్రాద్ధం. తమరు భోక్తగా దయచెయ్యాలి,'' అని కోరేవాడు. నిజమేననుకుని బ్రాహ్మణులు వచ్చేవారు. ఈ లోపుగా వాతాపి మేకరూపం ధరించేవాడు. ఇల్వలుడా మేకను కోసి బ్రాహ్మణులకు పెట్టే

వాడు. బ్రాహ్మణులా మేకను పూర్తిగా తిన్నాక ఇల్వలుడు, ''వాతాపీ, ఇక వచ్చెయ్యి,'' అనే వాడు. అప్పుడు వాతాపి మేకలాగా అరుచు కుంటూ ఆ బ్రాహ్మణుల పొట్టలు చీల్చు కుని వచ్చేవాడు.

ఈ విధంగా వారు అనేక వేల బ్రాహ్మణు లను చంపిన మీదట ఇల్వలుడికి అగస్త్య మహాముని తటస్థపడ్డాడు. ఇల్వలుడి కోరికపై ఆయన భోజనానికి వచ్చి అతడు పెట్టిన మేక మాంసం తిన్నాడు. ఆయన తృప్తిగా భోజనం చేశానన్న అనంతరం ఇల్వలుడాయనకు హస్తోదకం ఇచ్చి, ''ఇక రా వాతాపీ!'' అని కేకపెట్టాడు.

అగస్త్యుడు నవ్వుతూ, ''ఇంకెక్కడి వాతాపి? వాడప్పుడే జీర్ణమై, యముడి ఇంటికి చేరు కున్నాడు!'' అన్నాడు. ఇల్వలుడు తన తమ్ముడు చచ్చాడని తెలిసి మండిపడి అగ స్త్యుడి పైకి లేచి ఆయన చూపుల వేడికే బూడిద అయిపోయాడు.

రాముడీ కథ చెప్పి లక్ష్మణుడితో, ''అంత శక్తిమంతుడైన అగస్త్యులవారి తమ్ముడి ఆశ్రమం ఇది,'' అన్నాడు. అప్పటికే సూర్యా స్తమయ మయింది. అగస్త్యుడి తమ్ముడు సీతా రామలక్ష్మణులకు ఆతిథ్యం ఇచ్చాడు. వారా రాత్రి అక్కడే గడిపి, మర్నాడు ఉదయం ఆయన వద్ద సెలవు పుచ్చుకుని అగస్త్యా శ్రమానికి బయలుదేరారు. దారిలో ఎత్తయిన చెట్లు కనబడ్డాయి, మనోహరంగా పక్షులు పాడే పాటలు వినపడ్డాయి. అగస్త్యాశ్రమం పరిసరాలు అరణ్యంలాగా లేక ప్రశాంతం



గానూ, అందంగానూ ఉండటం రామ లక్ష్మ ణులు గమనించారు.

రాముడు లక్ష్మణుడితో, ''అగస్త్యుడు మహిమాన్వితుడు. సూర్యుడి మార్గానికి అడ్డంగా పెరుగుతూ వచ్చిన వింధ్య పర్వతా లను నిగ్రహించాడు. ఆయన దక్షిణ దేశానికి వచ్చి స్థిరపడినాక, దక్షిణానికి అగస్త్యుడి దిక్కనే పేరు వచ్చింది. ఆయన ఆశ్రమం అతి పవిత్ర మైనది; అందులో క్రూరులూ, వంచకులూ, పాపులూ నివసించలేరు. అలాటి చోటికి చేరుకున్నాం. లక్ష్మణా, నీవు ముందు వెళ్ళి, నేనూ సీతా వస్తున్నామని అగస్త్యులవారితో చెప్పు,'' అన్నాడు.

లక్ష్మణుడు ఆశ్రమం ప్రవేశించి, అగ స్త్యుడి శిష్యులలో ఒకణ్ణి పట్టుకుని, ''నేను దశరథ మహారాజు కొడుకును, లక్ష్మణుడనే



వాణ్ణి. నేనూ, మా అన్న అయిన రాముడూ, ఆయన భార్య అయిన సీతా అగస్త్యులవారి దర్శనార్థం వచ్చాం. కనుక వారితో ఈ సంగతి చెప్పు," అన్నాడు.

అగ్నిహోత్ర గృహంలో ఉన్న అగస్త్యుడికి శిష్యుడీ వార్త చెప్పాడు. వెంటనే అగస్త్యుడు, "వారు వస్తారని అనుకుంటూనే ఉన్నాను. వారు ఆశ్రమంలోకి రాదగిన వారే; నీవు అప్పుడే తీసుకురావలిసింది. వెంటనే వెళ్ళి వారిని లోపలికి తీసుకురా," అన్నాడు. శిష్యుడు గబగబా వచ్చి లక్ష్మణుడితో, "ఆ సీతారాములెక్కడ ఉన్నారు? వెంటనే రమ్మనండి," అన్నాడు.

ఇద్దరూ కలిసి ఆశ్రమ ద్వారం వద్దకు వెళ్ళారు. శిష్యుడు అతి వినయంగా సీతా రాములకు స్వాగతం చెప్పి లోపలికి తీసుకు వచ్చాడు. అగస్త్యుడు సూర్య తేజస్సుతో వెలిగిపోతూ శిష్యులతో సహా ఎదురు వచ్చాడు. అగస్త్యుణ్ణి రాముడు ఆ తేజస్సు చేతనే గుర్తించాడు. సీతారామ లక్ష్మణులాయన కాళ్ళకు వందనం చేసి, చేతులు మోడ్చి నిలబడ్డారు.

అగస్త్యుడు వారిని అతిథులుగా స్వీకరించి, ఆసనాలూ, అర్ఘ్యపాద్యాలూ ఇచ్చి, కందమూల ఫలభోజనం వారికి పెట్టాడు.

అగస్త్యుడి వద్ద ఒక అపూర్వమైన ధనువున్నది. అది విష్ణువుది; బంగారు నగిషీలు కలిగి, రత్నాలు పొదిగినది. దానిని విశ్వకర్మ తయారుచేశాడు. బ్రహ్మదేవుడిచ్చిన ఒక అపూర్వమైన బాణమూ, ఇంద్రుడిచ్చినరెండు అక్షయబాణ తూణీరాలూ, బంగారు ఒరగల ఒక ఖడ్గమూ ఉన్నాయి. వీటినన్నిటినీ అగస్త్య మహాముని రాముడికి కానుకగా ఇచ్చేశాడు.

తరవాత ఆయన రాముడితో, "నాయనా, నాకు నమస్కారం చెయ్యటానికి మీరు ఇంత దూరం వచ్చారు. చాలా సంతోషం. మీరంతా బడలి ఉంటారు. అతి సుకుమారి, కష్టసమయంలోకూడా భర్తను విడవని మహా పతివ్రత, సీత మరింత అలసి ఉంటుంది. కనుక మీరంతా విశ్రాంతి తీసుకోండి," అన్నాడు.

"నా అరణ్యవాస దీక్ష పూర్తి అయ్యేదాకా మేము ఆశ్రమం నిర్మించుకుని నివసించటానికి యోగ్యమైన స్థలం ఉంటే చెప్పండి," అని రాముడు అగస్త్యుణ్ణి అడిగాడు.

"ఇక్కడికి రెండామడల దూరంలో పంచవటి ఉన్నది. నీరూ, దుంపలూ సమృద్ధిగా

ఉన్నాయి. లేళ్ళుకూడా జాస్తి. అక్కడ నీవు ఆశ్రమం ఏర్పరచుకోవచ్చు. నీ వనవాసం చాలాభాగం అయ్యేపోయింది. ఆ మిగిలినది కాస్తా పూర్తి కాగానే తిరిగి అయోధ్యకు వెళ్ళి సుఖంగా రాజ్యం చేసుకుంటావు. కావలిస్తే నీవు నా ఆశ్రమంలోనే ఉండవచ్చు. కాని నీకు వేరే ఆశ్రమంలో ఉండాలని ఉన్నట్టున్నది. అందుచేత పంచవటి పేరు చెప్పాను. అది చాలా అందమైన చోటు, సీతకు చాలా బాగుం టుంది. అదుగో, ఆ కనిపించే ఇప్పచెట్ల సమూహానికి ఉత్తరంగా వెళితే ఒక మర్రి చెట్టు వస్తుంది. దాన్ని దాటి మరి కొంత దూరం పోతే ఒక ఎత్తు ప్రదేశం వస్తుంది. ఆ మిట్ట ఎక్కి చూస్తే ఒక పర్వతమూ, దాని పక్కన గోదావరీనదీ, దాని ఒడ్డున పంచవటీ కనిపిస్తాయి,'' అని అగస్త్యుడు చెప్పాడు.

సీతారామ లక్ష్మణులు అగస్త్యుడికి నమస్క రించి ఆయన అనుజ్ఞ పొంది ఆయన చెప్పిన దారినే పంచవటికి బయలుదేరారు. దారి మధ్యలో వారికొక బ్రహ్మాండమైన గద్ద కన బడింది. దాన్ని చూసి రామ లక్ష్మణులు ఎవరో రాక్షసుడనుకుని, ''ఎవరు నీవు?'' అని ప్రశ్నించారు. ఆ గద్ద వారితో చాలా మంచిగా, ''నాయనలారా, నేను మీ తండ్రి దశరథ మహారాజు స్నేహితుణ్ణి. నా కులగోత్రాలు చెబుతాను. దక్షప్రజాపతికి అరవైమంది కూతుళ్ళు. వారిలో ఎనిమిది మందిని కశ్య పుడు పెళ్ళాడాడు. వారిలో తామ్ర అనే ఆమె అయిదుగురు ఆడపిల్లలను కన్నది. వారిలో ఒకతె శుకి. శుకి కూతురు నత, నత కూతురు వినత. వినతకు గరుడుడూ, అరుణుడూ అని ఇద్దరు కుమారులు. అరుణుడు మా



తండ్రి, శ్యేని మా తల్లి. నాకు సంపాతి అని అన్న ఉన్నాడు. నా పేరు జటాయువు. ఇది చాలా భయంకరమైన అరణ్యం. ఎన్నో క్రూర మృగాలు, ఎందరో రాక్షసులు. అందుచేత మీ కభ్యంతరం లేకపోతే మీ వెంట ఉండి మీరిద్దరూ ఎటైనా వెళ్ళినప్పటికీ సీతకు నేను అండగా ఉంటాను,'' అన్నది.

జటాయువు వృత్తాంతం విని రాముడు చాలా సంతోషించి, తన తండ్రిని గురించి కబుర్లాడుతూ, సీతా లక్ష్మణ జటాయువు లతో సహా పంచవటి చేరుకున్నాడు.

పంచవటి విషసర్పాలతోనూ, క్రూర మృగాలతోనూ, బాగా పూచిన చెట్లతోనూ నిండి ఉన్నది. ''లక్ష్మణా, ఇదే పంచవటి. నీకూ, నాకూ, సీతకూ సుఖంగానూ; నీటికీ, ఇసుకదిబ్బలకూ, దర్భలు మొదలైన వాటికీ దగ్గిరగానూ ఉండే చోటు చూసి పర్ణశాల నిర్మించు,'' అన్నాడు రాముడు.

''అన్నా, నీవే అలాటి చోటు చూసి, పర్ణ శాల నిర్మించమని ఆజ్ఞ ఇవ్వు. నీ ఆజ్ఞ నిర్వర్తి స్తాను,'' అన్నాడు లక్ష్మణుడు.

రాముడు ఒకసమప్రదేశం చూసి అక్కడ పర్ణశాల నిర్మించమని లక్ష్మణుడికి చెప్పాడు. ఆ ప్రదేశం గోదావరికి సమీపంగా ఉన్నది. లక్ష్మణుడు మట్టి తవ్వి గోడలు పెట్టాడు; వెదురు స్తంభాలు బలమైనవి నిలబెట్టి, వాటి పైన జమ్మికొమ్మలు పరిచి, తాళ్ళతో గట్టిగా కట్టి, వాటిపైన రెల్లుతోనూ, దర్భలతో మంచి కప్పు వేశాడు; పర్ణశాల అందంగా కుదిరింది. లక్ష్మణుడు పర్ణశాల లోపలి నేల అంతా చక్కగా చదునుచేశాడు.

రాముడు గోదావరికి వెళ్ళి, స్నానం చేసి పద్మాలూ, మధురమైన ఫలాలూ తెచ్చాడు. లక్ష్మణుడు పర్ణశాలకు పుష్పబలి చేసి శాంతి జరిపాడు.

ఇంతపనీ చేసినందుకు రాముడు లక్ష్మ ణుణ్ణి ఆప్యాయంగా కౌగలించుకుని, ''లక్ష్మణా, నీవు నన్ను ఇలా కనిపెట్టి ఉంటే నాకు మన తండ్రి జీవించి ఉన్నట్టే ఉన్నది,'' అన్నాడు.

ఆ పర్ణశాలలో సీతారామలక్ష్మణులు సుఖంగా నివసించారు.





# తెలివైన దొంగ

ఒకనాటి చీకటివేళ ముగ్గురు దొంగలు, తాము నగరంలో దోచిన డబ్బూ, నగలతో అరణ్యం చేరి, అక్కడ పాడుబడిన గుడిలోని విగ్రహం వెనక దాన్ని దాచి, నిర్భయంగా మండపంలో కూర్చుని కబుర్లు చెప్పుకో సాగారు.

మాటల మధ్యలో, వాళ్ళల్లో పెద్ద దొంగకు ఒక విచిత్రమైన ఆలోచన వచ్చింది. వాడు మిగతా ఇద్దరితో, ''ఒరే, నే చెప్పేది జాగ్రత్తగా వినండి! ఇప్పుడు మనం దాచిన ధనం తలా కాస్త పంచుకుంటే మనలో ఎవడి దరిద్రమూ తీరదు. అలాకాక, మనలో ఎవరో ఒకరు మొత్తం ధనం తీసుకోవడం జరిగితే, వాడు ఇకముందు ప్రమాదకరమైన దొంగవృత్తి మాని, ఏ వ్యాపారమో చేసుకుంటూ హాయిగా బతకవచ్చు. ఏమంటారు?'' అన్నాడు.

ఇందుకు వెంటనే దొంగలిద్దరూ సరేన న్నారు.

అయితే, దొంగిలించిన ధనమంతా ఎవరు తీసుకోవాలో నిర్ణయించడం పెద్ద సమస్య అయింది.

పెద్ద దొంగ కొంచెంసేపు ఆలోచించి, ''ఇందుకు నాకొక ఉపాయం తోస్తున్నది. ఈ తెల్లవారుజాము లోపున, మనలో ఎవరికి ఆ దాచిన సొమ్ము సాయంతో కోటీశ్వరుడయి నట్టు కల వస్తుందో, వాళ్ళకు దాన్ని ఇచ్చి వేద్దాం. ఈ ఆలోచన బావున్నదంటారా?'' అన్నాడు.

మిగిలిన దొంగలిద్దరూ ఇందుకు ఒప్పు కున్నారు. తరవాత అందరూ నిద్రపోయేం దుకు పడుకున్నారు. కాని, ఎవరికీ నిద్ర రావడంలేదు. కొంతసేపటికి పెద్ద దొంగ తెల్ల వారి తన మిత్రులకు చెప్పడానికి ఒక కల ఆలోచించుకుని తృప్తిగా నిద్రపోయాడు. రెండోవాడు కూడా తతిమ్మా ఇద్దరికీ చెప్పేం దుకు ఒకకల ఊహించుకుని కళ్ళు మూసుకు



న్నాడు. మూడో దొంగ ఒక పథకం వేసుకుని, మిగిలిన ఇద్దరూ నిద్రపోయేదాకా ఆగి, ధనం మూటను తీసుకుపోయి, దాపులనున్న ఒక మర్రిచెట్టు తొర్రలో దాచి వచ్చి పడుకున్నాడు.

తెల్లవారిన తరవాత ముగ్గురు దొంగలూ మేలుకున్నారు. చిన్నవాళ్ళిద్దరూ అడిగిన మీదట పెద్ద దొంగ తనకొచ్చిన కల అంటూ ఇలా చెప్పాడు:

''నేను మనం దొంగిలించి తెచ్చిన డబ్బంతా తీసుకుని, నేనెన్నడూ చూడని ఒక రాజ్యంలో ప్రవేశించాను. ఎక్కడ చూసినా చక్కని పైరు పంటలతో రాజ్యం సుభిక్షంగా వున్నది. కాని, విచారించగా ఆ రాజ్యంలో దొంగల భయం అధికంగా వున్నట్టు తెలిసింది. అందువల్ల, డబ్బంతా ఎక్కడైనా సురక్షిత ప్రదేశంలో దాచి, ఏదైనా వ్యాపారం చేద్దామనుకున్నాను. కాని, దురదృష్టవశాత్తు, ఆ రాత్రే డబ్బంతా దొంగల పాలయింది.

నాకు దుఃఖం ఆగింది కాదు. అప్పటి కప్పుడే పోయి రాజుకు చెప్పుకున్నాను. రాజు ఎంతో విచారపడిపోతూ, 'నాయనా, నువ్వు పరాయిదేశం వాడిలా వున్నావు. నా దేశంలోని గజదొంగలను పట్టినవాడికి, నా కుమార్తెతో పాటు అర్ధరాజ్యం కూడా ఇస్తానని చాటింపు వేయించాను. కాని, ఎవరికీ ఆ దొంగలను పట్టడం సాధ్యం కాలేదు,' అన్నాడు.

రాజకుమార్తె, అర్ధరాజ్యం అన్న మాటలు వింటూనే, నాలో ఉత్సాహం పొంగి పొర్లింది. నేను రాజుతో, 'మహారాజా, విచారించకండి! నేను, ఆ గజదొంగలందర్నీ పట్టి బంధించ గలను,' అని చెప్పాను.

దొంగను పట్టేందుకు దొంగే కావాలని వుట్టినే అనలేదుగదా! నేను క్షణాల మీద దేశంలోని దొంగలందర్నీ పట్టుకుని, రాజుకు ఒప్పచెప్పాను. ఆయన అన్న మాట ప్రకారం రాజకుమార్తెను నాకిచ్చి చేసి, అర్ధరాజ్యం కూడా ఇచ్చాడు. ఈ విధంగా మనం దాచిన సొమ్మువలన నేను కోటీశ్వరుణ్ణే కాదు, ఒక దేశానికే రాజును కాగలిగాను.''

రెండవ దొంగ మొదటివాడితో, ''ఫర్వా లేదు, ఒక మోస్తరుగా మంచి కలే కన్నావు!'' అని తన కొచ్చిన కల గురించి ఇలా చెప్పాడు:

'నేను డబ్బూ, నగలూ తీసుకుని తూర్పు దీవుల్లో వ్యాపారం చేసేందుకు ఓడ ప్రయాణం చేస్తూండగా, ఓడ పెద్ద తుఫానులో చిక్కు కుని బుడుంగున మునిగిపోయింది. నేను

డబ్బూ, నగలూ వున్న మూటతో క్షేమంగా నాగలోకం చేరాను. అక్కడ వున్న వజ్రాలూ, మణులూ చూసి నా కళ్ళు జిగేలు మన్నాయి. కాని, వింత ఏమిటంటే, నాగలోకవాసులు నా వెంటవున్న నగల పనితనం చూసి అబ్బుర పడిపోయారు.

నాగలోకపు యువరాణి నాగదేవి, తన చెలికత్తెలను వెంటబెట్టుకుని వచ్చి, నగల్ని తన కిమ్మని అడిగింది.

ఆ క్షణంలో నా బుర్ర మహా చురుగ్గా పని చేసింది. నేను నగలను నాగదేవికి ఇవ్వకుండా కొన్నిటిని ఆమె చెలికత్తెలకు బహూకరించాను. నాగదేవి తన చెలికత్తెలు తనకన్న అందమైన ఆభరణాలు ధరించడం చూసి ఈర్ష్యపడి పోయి, నా దగ్గిరకు వచ్చి, దీనంగా, 'నువ్వు ఏది కోరినా ఇస్తాను. ఆ మిగిలిన నగలన్నీ నా కిచ్చెయ్యి,' అన్నది.

ఆ మాట కోసమే ఎదురుచూస్తున్న నేను ఆమెతో, 'నాగదేవీ, నేను పుట్టి పెరిగిన దేశం వదిలి, ఎన్నో శ్రమలకోర్చి నిన్ను వివాహ మాడేందుకు ఇక్కడి కొచ్చాను. ఈ నగలన్నీ నీవే!' అంటూ నగలన్నీ ఇచ్చేశాను.

అన్నమాట ప్రకారం నాగదేవి అప్పటి కప్పుడే మహావైభవంగా నన్ను వివాహమాడింది. ఈ విధంగా మనం దాచిన సొమ్మువలన నేను నాగయువరాణిని వివాహమాడి, నాగలోకానికే రాజును కాగలిగాను.''

మొదటి ఇద్దరి కలలూ విన్న మూడవ దొంగ విచారంగా ముఖం పెట్టి తన కల గురించి ఇలా చెప్పాడు: ''మీ ఇద్దరి కలలతో



పోల్చితే అసలు నాది కలేకాదు. వినండి! నేను దాచిన ధనం, నగలూ తీసుకుపోయి వ్యాపారం చేసి కోటీశ్వరుణ్ణి కావడమేకాక, మరొక కోటీశ్వరుడి కుమార్తెను కూడా వివాహం ఆడాను. అయితే, మా ఇద్దరి కాపురం హాయిగా జరిగిపోతున్న సమయంలో, హఠాత్తుగా ఏదో పెద్ద చప్పుడయి కల చెదిరిపోయి, కళ్ళు తెరిచాను.

నలుగురు ముసుగు దొంగలు విగ్రహం వెనక మనం దాచిన ధనం తీసుకుని గుడి నుంచి బయిటికి పోతున్నారు. నేను వెంటనే పెద్దన్నను తట్టిలేపుతూ, 'దొంగలు! దొంగలు!' అన్నాను. కాని, పెద్దన్న కళ్ళు తెరవకుండానే, 'నా రాజ్యంలో దొంగలా? వాళ్ళను ఏనాడో, కాలరాచేశాను!' అంటూ పక్కకు తిరిగి పడుకున్నాడు.

అప్పుడు చిన్నన్న భుజం తడుతూ, సంగతి చెప్పాను. చిన్నన్న కూడా కళ్ళు తెరవకుం డానే, 'నాగదేవీ, నేను రాజునై వుండగా, ఈ నాగలోకంలో దొంగలా? అహ్హహ్హ!' అంటూ నవ్వసాగాడు.

ఈ లోపల ముసుగు దొంగలు మన ధనంతో అరణ్యంలోకి పారిపోయారు.

ఇది వింటూనే పెద్ద దొంగలిద్దరూ గాభరా పడుతూ విగ్రహం వెనక్కుపోయి, ధనం మూట కోసం చూశారు; అది అక్కడ కని పించలేదు.

వాళ్ళు కోపంగా చిన్నవాడి దగ్గిరకు వచ్చి, ''నిజం చెప్పు! దొంగలు రావడం, నువ్వు మమ్మల్ని నిద్రలేపాలని చూడడం, అంతా పచ్చి అబద్ధం!'' అన్నారు.

చిన్నవాడు ఏమీ తొణక్కుండా, ''ఇందులో అబద్ధం ఏమీలేదు. మన దురదృష్టం ఏమంటే, ఆ దొంగలు వచ్చి మనం దాచిన సొమ్ము ఎత్తుకుపోతున్నప్పుడు, మీరు తీరని రాచకార్యాల్లో తలమునకలై వుండడం!'' అన్నాడు.

ఆ జవాబుతో పెద్దవాళ్ళిద్దరూ రెచ్చిపోయి, ''ఒరే, నిజానికి మేం ఎలాంటి కలలూ కన లేదు. నిద్రపోయే ముందు వాటిని ఊహిం చుకున్నాం. అంతే! ఇప్పుడైనా నిజం చెప్పు. ఆ ధనం ఎక్కడ దాచావు?'' అని అడిగారు.

ఈసారి చిన్న దొంగ పెద్దగా నవ్వి, ''మీకు ఎలాంటి కలలూ రాలేదన్న మాట! బావుంది. అందువల్ల, మనం అనుకున్న మాట ప్రకారం నేను కన్న కలే గొప్పది. కనక, ధనం అంతా నాకే చెందాలి,'' అంటూ పోయి మర్రిచెట్టు తొర్రలో దాచిన ధనం మూటను తెచ్చి వాళ్ళ ముందుంచాడు.

దొంగలిద్దరూ చిన్నవాడి తెలివితేటలకు ఆశ్చర్యపోయారు. తాము పెద్దవాళ్ళయివుండీ చిన్నవాణ్ణి మోసం చేయాలనుకున్నందుకు సిగ్గుపడిపోయి, మొత్తం ధనాన్ని చిన్నవాడికి ఇస్తూ, ''ఒరే, తమ్ముడూ! ఈనాటినుంచీ నువ్వు దొంగతనాలు మాని, ఎక్కడికైనా పోయి ఈ ధనంతో ఏదైనా వ్యాపారం చేసుకుంటూ, తగిన పిల్లను వివాహమాడి సుఖంగా బతుకు,'' అన్నారు.



చిత్రాలు: గాంధి అయ్య

16

# అజేయుడు గరుడుడు!

ప్రమాదం నుంచి ఆదిత్యుణ్ణి కాపాడిన గరుడుడు, అతన్ని శిథిలాలయం సమీపంలో దించి, ఆ దేవాలయ నిర్మాణం గురించీ, స్వార్థపరుల పాప కృత్యాల పర్యవసానంగా ఏర్పడిన భూకంపం కారణంగా ఆలయం ఇసుకలో కూరుకుపోయిన విషయమూ తెలియజేశాడు. ఆలయాన్ని ఒకసారి తిరిగి చూసిన ఆదిత్యుడు దానిని శుభ్రం చేయడానికి దాపులనున్న గ్రామం నుంచి పనిముట్లు తెమ్మని ఇద్దరు భటులను పంపాడు.

అక్కడ చంద్రపురిలో... వీరబాహు మహారాజును దర్శించడానికి వెళ్ళాడు.

మహాప్రభూ, ఒక శుభవార్త! ఆదిత్యుడు క్షేమంగా ఉన్నాడు. మన సైనికులు చేరే సమయానికి ముందే ఆయన శిథిలాలయంవద్ద ఉన్నాడు. కొందరు శిల్పులను, కార్మికులను పంపమని కబురు పంపాడు.

ఆలయ పునరుద్ధరణ పనులు ప్రారంభం కాగానే అతడు తిరిగి రావచ్చు.

అరుణ చెలికత్తెను ఒక భటుడు వెంట బెట్టుకుని వచ్చాడు.

ఏమిటి మాలినీ? యువరాణి ఎలా ఉన్నది?

అంతా అద్భుతంగా ఉంది. మా కళ్ళను మేమే నమ్మలేకుండా పోయాం.

వింత ఏడుపు వినిపించింది. అయితే, అది యువరాణి నుంచి కాదు. ఆమె గదిలోకి హఠాత్తుగా నీడలాంటి ఆకారం ప్రవేశించింది...


...ఆ తరవాత వచ్చినంత వేగంతోనే ఉన్నట్టుండి ఆ నీడ పొగలా మారి కిటికీ గుండా వెలుపలికి వెళ్ళిపోయింది.


అరుణకు ఏమయింది? అది చెప్పు.
మహాప్రభూ! ఆమె భ్రమనుంచి బయట పడినట్టు కనిపిస్తోంది.


రక్షించావు దేవుడా! అది మంచి సంకేతం!
ఆమె యువరాజును గురించి అడుగుతున్నది మహాప్రభూ!
నువ్వు వెళ్ళు. నీ వెనకే మేము వస్తున్నాం.


మాలిని అక్కడి నుంచి బయలుదేరింది.


మహారాజూ, వీరబాహూ యువరాణి భవనం కేసి బయలుదేరారు...
వీరబాహూ, నాకు ఆదిత్యుడి క్షేమం గురించే విచారంగా ఉంటోంది.
ప్రభూ, తనకు వచ్చిన ఆపదలన్నిటినీ...


...ఆయన తుత్తునియలు చేసిన సంగతి తమరు మరిచి పోయారా?
నిజమే వీరబాహూ. అయినా ఇప్పుడతడు చంద్రపురి నుంచి దూరంగా ఉన్నాడు కదా?


మహాప్రభూ! మన సేనాధిపతి తమకు వ్యతిరేకంగా పన్నిన కుట్రల గురించి తమకు తెలియనిది కాదు కదా?




ఆ సమయంలో ఆదిత్యుడే మారు వేషంలో రాజ్యంలో సంచరిస్తూ సేనాధి పతి నరేంద్రదేవుడి కుట్రలను బయట పెట్టే భగ్నం చేశాడు.




వాళ్ళ కుతంత్రాలేవీ ఫలించక పోవడంతో క్షుద్ర మాయాశక్తులుగల మాంత్రికులను కూడా ఆశ్రయించారు.


నరేంద్రదేవుడు పర్వతాలయానికి వెళ్ళి, ప్రధాన పూజారి నాగబంధును కలుసుకుని అతడి సలహా ప్రకారం ఆదిత్యుణ్ణే బలి ఇవ్వడానికి పూనుకున్నాడు.


నాగబంధు తన మంత్రశక్తితో ఏవేవో క్షుద్ర రూపాలను ఆదిత్యుడి మీదికి ప్రయోగించాడు!


...అయితే అవేవీ ఆదిత్యుణ్ణే ఏమీ చేయలేక పోయాయి. ఆయన మామూలు మనిషి కాడు కదా. మానవాతీత దివ్యశక్తులు ఆయున్ను కాపాడుతూ వచ్చాయి.


ఆఖరికి గరుడభగవానుడు దుష్టమాంత్రికుడు నాగబంధు అంతం చూశాడు.


ఆ దేవాలయంలోని దేవుడు ఆదిత్యుడికి ఎలాంటి ఆపదా రాకుండా రక్షించగలడు. ఆయన దివ్యాశీస్సులు గలవాడని మళ్ళీ ఒకసారి నిరూపించగలడు.
అతనికి ఎలాంటి హానీ కలగదనే నేనూ విశ్వసిస్తున్నాను.
-(ఇంకావుంది)

మన సాంస్కృతిక ఉత్సవాలు

# బుద్ధ (జయంతి) పూర్ణిమ



గౌతమ బుద్ధుడి జీవితానికీ, వైశాఖ పూర్ణిమకూ విడదీయ రాని సంబంధం ఉన్నది. మానవ జాతికి నూతన మార్గం చూపిన బుద్ధుడి జీవితంలో ముఖ్యమైన మూడు సంఘటనలు ఈ రోజునే జరిగాయి. క్రీ.పూ. 6వ శతాబ్దంలో ఆయన శుద్ధోదన మహారాజు కుమారుడు సిద్ధార్థుడిగా జన్మించింది మన పంచాంగంలో రెండవ మాసమైన వైశాఖ పూర్ణిమ నాడు!

సిద్ధార్థుడికి ఇరవైతొమ్మిదేళ్ళు వచ్చేంతవరకు మనుషులు నిత్యజీవితంలో ఎదుర్కొనే బాధలు, వ్యాధులు, ముసలితనం, చావులు మొదలైన వాటి గురించి అసలు తెలియదు. మొట్టమొదటి సారిగా నగర విహారానికి వెళ్ళినప్పుడు ఇలాంటి బాధాకర దృశ్యాలు ఆయన కంటబడి ఆయన మనసును కలచి వేశాయి. ఈ బాధలకు పరిష్కారం, జీవితానికి ఓ అర్థం కనుగొనాలన్న దృఢ సంకల్పంతో రాజభోగాలను, భార్యాబిడ్డలను త్యజించి బయటి ప్రపంచంలోకి అడుగు పెట్టాడు.

ఎనిమిదేళ్ళపాటు ఎందరెందరినో చూస్తూ, ఏవేవో సాధనలు చేస్తూ ఎక్కడెక్కడో తిరిగాడు. ఆఖరికి బుద్ధగయలో ఒక రావి చెట్టు కింద కూర్చుని ధ్యాన నిమగ్నుడై ఉండగా ఆయనలో జ్ఞానోదయమయింది. అది కూడా వైశాఖ పూర్ణిమ రోజే! అక్కడినుంచి ఆయన ప్రజలకు జ్ఞానబోధ చేస్తూ దేశసంచారం ప్రారంభించాడు. దాదాపు నలభై సంవత్సరాలు అలా గడిపి ఎనభైయవయేట నిర్వాణం పొందాడు. నిర్వాణం పొందిన రోజు కూడా వైశాఖ పూర్ణిమ కావడం విశేషం!

ప్రపంచ వ్యాప్తంగా ఉన్న బౌద్ధ మతానుయాయులు వైశాఖ పూర్ణిమను చాలా పవిత్రమైన రోజుగా పరిగణిస్తారు. మనదేశంలో బుద్ధ జయంతి నాడు పలువురు బుద్ధగయను చేరి ప్రార్థనా సమావేశాలలో పాల్గొంటూ, ప్రసంగాలు వింటూ, పఠనంతో, ధ్యానంతో, ఊరేగింపులతో గడుపుతారు. ఈ సందర్భంగా యాత్రికులు ఉత్తరప్రదేశ్‌లోని సారనాథ్‌ను కూడా సందర్శిస్తారు. ఈ సంవత్సరం బుద్ధ జయంతి మే 2న వస్తోంది.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :



### కంప్యూటర్ నుంచి సువాసనలు

ఇంటర్నెట్ చూసేవారి సంఖ్య రోజురోజుకూ పెరిగిపోతూ వుంది. ఇంటర్నెట్ సేవలందించే సంస్థలు వీక్షలకు ఉచిత డౌన్‌లోడింగ్ నుంచి రకరకాల విషయాలను అందిస్తూ వారిని ఆకర్షించడానికి ప్రయత్నిస్తున్నాయి. ఒక కాలిఫోర్నియా కంపెనీ వీక్షకులను ఆకర్షించడానికి విలక్షణమైన మార్గాన్ని కనుగొన్నది. వీక్షకుల ఘ్రాణేంద్రియానికి హాయిగొల్పగలమని చెబుతున్నది. వీక్షకులు కంప్యూటర్ స్క్రీన్ మీద చూసేవాటి వాసనలను హాయిగా పీల్చగలరన్న మాట.

ఈ 'వర్చువల్ ప్రపంచ' పరిమళాలను అందుకోవడానికి మీరు చేయవలసిందల్లా 'ఐ స్మెల్' పరికరాన్ని మీ కంప్యూటర్‌లో అమర్చుకోవడం మాత్రమే. ఇందులో రకరకాల రసాయనిక పదార్థాలు ఉంటాయి. వీటిని విభిన్న నిష్పత్తులలో కలపడం ద్వారా రకరకాల సువాసనలను సృష్టించవచ్చు.

విభిన్న పరిమళాల సంక్లిష్ట రసాయనిక మిశ్రమాలను డిజిటల్ సిగ్నల్స్‌గా మార్చగల సాఫ్ట్‌వేర్‌ను ఈ కంపెనీ కనుగొన్నది. స్క్రీన్ మీద కనిపించే బొమ్మ సరైన సిగ్నల్‌తో కలుపబడినప్పుడు ఈ పరికరం పనిచేయడం ప్రారంభిస్తుంది. ఈ పరికరం ఆ తరవాత సాఫ్ట్‌వేర్‌ను ఉపయోగించి సిగ్నల్‌ను తగిన సువాసనగా మారుస్తుందన్న మాట.

## మన పరిసరాలు



### దూదేకుల పిట్ట

దూదేకుల పిట్టను 'పిచ్చుక డేగ' అని కూడా అంటారు. ఇది మిగతా పక్షులతో పోల్చినప్పుడు పరిమాణంలో చాలా చిన్నది. ఇది 'రాబిన్' పరిమాణంలో ఉంటుంది. ఈ పిట్టకు డేగ అలవాట్లు, పాలపిట్ట కాళ్ళు ఉంటాయి. నిజానికి, డేగలాగా కనిపిస్తూ పాటపాడే పిట్ట ఇదొక్కటే.

ఈ దూదేకుల పిట్టను 'బుచ్చర్ బర్డ్' అని కూడా అంటారు. ఇది వేటాడే పద్ధతిని బట్టి దీనికాపేరు వచ్చింది. దీనికి గోళ్ళ కాళ్ళు లేవుగనక, ఆహారాన్ని అంత సులభంగా పట్టుకోజాలదు. చాలా కష్టపడవలసి ఉంటుంది. అందువల్ల అలిసి పోయేంత వరకు వాటిని తరిమి తరిమి ఆఖరికి పట్టుకుని, ఏ ముళ్ళ కంప మీదో విసురుగా వేసి చంపి తింటాయి. ఇవి కీటకాలనూ, చిట్టెలుకలనూ, పిచ్చుకలనూ వేటాడి పట్టి తింటాయి.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మీకు తెలుసా?



### 'దిష్టి' గుమ్మడికాయ

తమిళనాడులో, కొత్త ఇళ్ళ ముందు రంగురంగుల రాక్షసుడి ముఖాల బొమ్మలు గీసిన గుమ్మడికాయలను వేలాడదీస్తారు. ముందువైపు రాక్షసుడి ముఖంలా కనిపించే బొమ్మ వెనక పెద్ద గుమ్మడికాయ ఉంటుంది.

కొత్తగా కట్టే ఇళ్ళకు దిష్టి అంటే దృష్టిదోషం తగలకూడదని ఇక్కడి ప్రజలు ఇలా చేస్తూ ఉంటారు. గృహప్రవేశాల సమయంలో, నూతన వాహనాలు కొన్నప్పుడూ వాటి ముందు గుమ్మడికాయలు కొట్టడం ఈ ప్రాంతంలో ఆచారంగా ఉంటోంది. అంతే కాదు. దుకాణాల ముందు, వర్క్ షాపుల ముందు కూడా అమావాస్యనాడు గుమ్మడికాయలు కొడుతూవుంటారు.

## మన దేశం క్విజ్

ఈ నెల క్విజ్ భారతీయ క్రీడాకారు(రిణు)లకు సంబంధించినది.



1. ఒలింపిక్స్‌లో తొలి ఇండివిడ్యువల్ మెడల్ సాధించిన వారెవరు? ఏ విభాగంలో?

2. ఈనాటి వరకు ఆసియా క్రీడలలో అత్యధిక పతకాలు గెలుపొందిన వారెవరు?

3. ఒక 'రాయల్ గేమ్'కు మన దేశం పుట్టినిల్లు? అది ఏది? ఎక్కడ పుట్టింది?

4. 'ఇంగ్లీష్ చానల్'ను ఈదిన మహిళ ఎవరు?

5. ఒక క్రికెట్ క్రీడాకారుడు టెస్ట్ మేచస్‌లో ఇంగ్లాండ్ కోసం ఆడాడు? ఆయన ఎవరు?

(సమాధానాలు 66వ పేజీలో)

## చందమామ ఇండియా క్విజ్ - 2 (మార్చ్ '07) విజేతలకు అభినందనలు

1. సాయి ప్రియభావన
తం.పే: బి.యం. వి. నారాయణశర్మ
పాటిల్ గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్
కార్పొరేట్ హెడ్ క్వార్టర్స్
205 & 206, అమర్‌చంద్ శర్మ
కాంప్లెక్స్ II ఫ్లోర్, సర్దార్ పటేల్ రోడ్,
సికింద్రాబాద్ - 500 003 (ఆం.ప్ర)

2. అబ్దుల్ మజీద్
తం.పే: అబ్దుల్ అజీజ్
ఇం. నం. 2/89,
రెడ్డిపల్లి పోస్ట్ - 515501
కదిరి తాలూకా,
అనంతపురం జిల్లా (ఆం.ప్ర)

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



TATA NARAYANAMURTHY



TATA NARAYANAMURTHY



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూలై 2007 సంచికలో ప్రచురిస్తాం.

ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్‌ఆఫీసర్స్‌కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 032.

## అభినందనలు

మార్చ్ నెల పోటీ ఫలితాలు

మల్లిపెద్ది కృష్ణారావు

తం.పే. నారాయణ

7-18-1ఎ, బాయ్స్ హైస్కూల్ రోడ్

మార్కాపురం - 523 316

ప్రకాశం జిల్లా (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : పెంచుకుంటే... ఇలా!

రెండవ ఫోటో : తెంచుకుంటే ఎలా?

## సమాధానాలు :

1. కె.డి. జాదవ్; రెస్లింగ్; హెల్సింకి 1952.
2. పి.టి. ఉష; 4 స్వర్ణ పతకాలు, 7 రజత పతకాలు.
3. పోలో; మణిపూర్.
4. ఆర్తి సాహా.
5. ఇఫ్తికార్ అలీఖాన్, పటౌడీ నవాబు, 1932-33.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)




# అమూల్యమైన చమురు అంతంత మాత్రమే లభ్యం

అన్ని ప్రకృతి వనరుల్లాగే చమురు కూడా కొన్ని ప్రాంతాల లోనే లభిస్తోంది. ఉత్తర అమెరికా, రష్యా, సౌదీ అరే బియా, మధ్య ఆసియా, ఉత్తర ఆఫ్రికా మొదలైన ప్రాంతా లను ప్రపంచంలో చమురు లభించే దేశాలుగా చెప్పవచ్చు. సముద్ర గర్భంలో కూడా చమురు నిక్షేపాలు ఉన్నాయి. అనేక దేశాలు 'ఆఫ్ షోర్ డ్రిల్లింగ్' ద్వారా ఈ చమురును వెలికి తీస్తున్నాయి.

దురదృష్టవశాత్తు మన దేశంలో చాలా తక్కువ మోతాదులోనే చమురు లభిస్తున్నది. అందువల్ల మన అవసరాలకు చాలా వరకు దిగుమతుల మీదే ఆధారపడవలసి ఉన్నది.

ఒకవైపు చమురు లభించడం లేదు. దానికి తోడు రోజు రోజుకూ అవసరాలు పెరిగిపోతున్నాయి. అందువల్ల చాలా జాగ్రత్తగా చమురును వినియోగించుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.






CHANDAMAMA (Telugu) May 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08




























